# ప్రకటన.

---

## జయరామకవి గ్రంథములు.

| | | | రు | అ | పై |
|---|---|---|---|---|---|
| 1 | సువర్ణ కేసరీ కృష్ణసేన | | 1 | 0 | 0 |
| 2 | కలియుగ దర్పణము | | 1 | 0 | 0 |
| 3 | గండికోటచరిత్ర (గీతము) | | 0 | 2 | 0 |
| 4 | రేనాటివీరుఁడు (నవల) | | 0 | 12 | 0 |
| 5 | తుకారాం (నాటకము) | | 0 | 12 | 0 |
| 6 | కడప | జిల్లా చరిత్ర | 0 | 4 | 0 |
| 7 | కర్నూలు | ,, | 0 | 4 | 0 |
| 8 | బళ్లారి | ,, | 0 | 4 | 0 |
| 9 | అనంతపురము | ,, | 0 | 4 | 0 |
| 10 | నెల్లూరు | ,, | 0 | 4 | 0 |
| 11 | చిత్తూరు | ,, | 0 | 4 | 0 |
| 12 | గుంటూరు | ,, | 0 | 4 | 0 |
| 13 | కృష్ణ | ,, | 0 | 4 | 0 |
| 14 | గోదావరి | ,, | 0 | 4 | 0 |
| 15 | గంజాము | ,, | 0 | 4 | 0 |
| 16 | విశాఖపట్టణము | ,, | 0 | 4 | 0 |
| 17 | దాసుశతకము | | 0 | 1 | 0 |
| 18 | ప్రాణసంరక్షుని (సాంఘిక ఆరోగ్య నాటకము) | | 1 | 0 | 0 |
| 19 | ప్రేమలేఖ | | 0 | 1 | 0 |
| 20 | పుష్పగిరి | | 0 | 1 | 0 |
| 21 | చౌడేశ్వరీవిలాసము | | 0 | 4 | 0 |
| 22 | ప్రణయినీలేఖ | | 0 | 1 | 0 |
| 23 | గండికోటపతనము | | 0 | 12 | 0 |
| 24 | శ్రీ గండి ఆంజనేయ శతకము | | 0 | 1 | 6 |
| 25 | లోకజ్ఞానము | | 0 | 5 | 0 |
| 26 | క్షేమకుమారి (భీతిగొలుపు సాంఘిక విషాదాంత నాటకము) | | 0 | 12 | 0 |
| 27 | ఊసరవెల్లి | | | | |

చిరునామా :—

శ్రీ గృహసరస్వతీ బుక్ డిపో,
కడప.

# ప్రేమ కుమారి.



## ప్రవేశము:—సూత్రధారుఁడు.

నాంది:—

శార్దూల విక్రీడిత వృత్తము.

శ్రీ విద్యా నిధియౌచు "విశారదుని" బల్
స్త్రీలోలునిఁ జేయఁగాఁ
బోవన్ "ప్రేమ కుమారి" నీతి విడకే
పొమ్మంచుఁ బోఁద్రోసి వే
మోవాల్గంటిని బ్రోవఁ దా నసు సమూ
హంబియ్య; సర్వేశుఁడున్
గావన్ జాలెను స్వర్గమిచ్చి; యతఁడే
కాచున్ మిమున్నిత్యమున్. ౧

## భారత మాతృ స్తవము.

జయమగు జయమగు భారతమాతా!
పావని! భారతమాయి!
సర్వ దేశములు సర్వ జలనిధుల్ సర్వ వాహినులును
హిందు ముసల్మాన్ క్రైస్తవ సిక్కు జైన పారసికులు
తమ శుభ నామ స్మరణా సలుపుచు నుండిరి మాత!
మంగళ మగును మాయీ!

శుభమగు శుభమగు పూన్యతవాశే!

జననీ భారతమాతా!

జయమా జయమా జయమా

జయము జయము జయమా.

జననీ భారతమాతాకి జై.

(ఇది ప్రస్తావన.)



# ప్రేమ కుమారి.



## ప్రథమాంకము.

(ప్రథమ రంగకము)

స్థలము :—మోహనరావు గృహము.

సమయము :—సాయంకాలము నాలుగు గంటలు.

సాయంకాలము నాలుగు గంటల సమయమున మోహనరావు తన భవన విశ్రాంతి గృహము నందు వార్తాపత్రికఁ జదువుచుండును.—

మోహ—(పత్రిక జదువుట చాలించి పడక కుర్చీపై ఆనుకొని యుండు వాఁడు కూర్చుండి యోజన నభినయించి) నా యనుంగు మిత్రుఁడు విశారదుఁడు నేఁడు గదా వత్తునని వ్రాసెను. (యోజించి బల్లపైనుండు జాబుల ఫైల్ (file) తీసికొని జాబును గైకొని చదువుట నభినయించి) ఔను. నేఁడే రావలసి యున్నది. నేఁడు గదా సుదినము. చిరకాల మిత్ర వియోగార్ణవమును నేఁడు గదా దాఁటఁ గలిగితిని. (చేతి గడియారమును చూచి) ఏమి నా యవివేకము. నా మిత్రుని స్టేషను కడఁ గలిసి కొననెంచి మఱచితిని. అయ్యో! వేళ మించినదే. ఇప్పటికి రైలుబండి వచ్చియే యుండును. నా మిత్రుఁ డేమను కొనునో గదా. కానిమ్ము, ఇప్పుడైన వెళ్లెద. ఒక వేళ ధూమ శకటము ఆలస్యముగ రాఁగూడదా (అని కంటి యద్దముల సవరించి పట్టు పంచ పైన వేసికొని, చేతి కఱ్ఱఁ గొని "స్లిప్పర్లు" ధరించి పోఁ బ్రయత్నించు)

ప్రవేశము :—రామోజి.

రామో—(ఒక చీటిని Visiting card దెచ్చి యిచ్చును.)

మోహ—(చూచుకొని సంతోషముతో) సరి. (అని స్లిప్పర్లు విడచి కఱ్ఱను బల్లపై నిడి. పట్టు సెల్లాను కుర్చీపై వేసి శ్వాసమును విడుచుచుఁ బ్రక్కకుఁ జూచును)

ప్రవేశము :—విశారదుఁడు.

మోహ—(త్వరితగతి నెదురేగి) మిత్రమా! క్షమింపుము. కుశలమా? (కరస్పర్శనము గావించును.)

విశా—మోహనా! సేమముగ వచ్చితి. శుభమే గదా?

మోహ—విశారదా! కూర్చుండుము. (అని తన పడక కుర్చీపైఁ గూర్చుండ నియమించి తాను వేఱొక కుర్చీ మీఁదఁ గూర్చుండును.)

విశా—మోహనా! జనని సురక్షితముగ నున్నది కదా?

మోహ—(ఆశ్చర్యమున లేచి) ఏమోయి! నీ వింకను గృహమున కేగలేదా?

విశా—లేదు. వస్తు సముదాయముతోఁ గూడ గుఱ్ఱపు బండిని గృహమున కనిపి, నీతో మాటాడి వచ్చునని తల్లి కెఱింగింపుమని బండి వానినిఁ బంపితిని.

మోహ—

ఉ.—ఏమి? విశారదా! యిటుల
నెన్నటి కైనను జేయ వచ్చునా?
యామె కృశించు చుండెఁ గద
యక్కట! సూనుఁడు సూనుఁడంచు నే
నామెకు నెన్నియో విధుల
నాసలఁ గొల్పఁగ నిల్చి యుండె; లే

తామస మేల పోద మిఁక,
"దల్లిని మించిన దైవ మున్నదే"— ౨

శాంతినికేతమున కేగి నేర్చికొనిన దిదియా? తొలుత మాతృ దర్శనము గావించి యామెకు సాష్టాంగ నమస్కారము లాచరించి సేమ మారసి యితర కార్యములఁ జూడనగుఁ గాని యిటులఁ జేయుట సరి కాదు. నీకుఁ బిచ్చి పట్టి యున్నదా?

విశా—అన్నా! నీ వనినట్లు పిచ్చివాఁడను కాను. తల్లిని మరచునట్టి పాపిని కాను. సర్వకాల సర్వావస్థల యందును మాతృ నామమునే జపించు నాకుఁ బ్రత్యేకముగ భక్తినిఁ జూపఁ బని లేదు. మాతృపూజ యైన వెనుక తండ్రి సేవ. ఆ పుణ్యము నాకు లేదు కదా. ఆ మీఁదట మిత్ర దర్శనము. కనుక నే నీ దగ్గఱకు విచ్చేసితి. మిత్రమా! నా జనని యేల కృశించుచున్నది. పిన్నామెకుఁ గావలసిన సౌకర్యముల నొసరింపు మని వేఁడుకొని యుంటినే.

మోహ—విశారదా! ప్రతి దినము నే నామె కడ కేగి యామె కోరిన సౌకర్యములను జరిపించు చున్నాను. పిచ్చితల్లి నే నెంత చెప్పినను నీపై బెంగ మానదు.

విశా—స్త్రీ స్వభావ మంతయే.

మోహ—కాదా మఱి. భర్త గతించి సంతతినే సర్వము నీవే యని నమ్మికొని యుండ; విద్యయను నెపమున నీవు విదేశముల కేగితివి. ఆమె యొంటరియై యెటులుండఁ గలదు. అమ్మా! నాకుఁ దల్లి లేదు. నిన్నే తల్లిగ భావించి యున్నాను. విశారదుఁడు వెళ్ళుచు మీకుఁ గావలసిన సౌకర్యముల నొసరింపు మనెను. నన్ను విశారదునిగా భావింపుమని చెప్పితిని. ఆమె కేలోటును గలుగ నీయ లేదు. ఆమెకు నీ నామస్మరణ తప్ప వేఱు లేదు. కనిపెంచిన తల్లి కంతె మాత్ర ము[illegible]?

విశా—అంతియే కదా. అయిన గృహమున కేగి యామెను చూచి పిమ్మట మా పెద్దతండ్రి గారిని జూడఁ బోయెద. నాకుఁ తండ్రియుఁ బెద్ద తండ్రియు నాయనగారే కదా.

మోహ—అవును. ఆయన జమీందారుఁడైనను మీరు బీదవారని యెంచి నిర్లక్ష్య భావమును జూపక నిన్నాదరించి యభివృద్ధికిఁ దెచ్చుచున్నాఁడు.

విశా—సత్యము వచించితివి. ఆ మహానుభావుఁడు నా యభివృద్ధికై యెంత డబ్బు సెలవు చేయుచున్నాఁడో నేఁ జెప్పఁ జాల. ఇఁకఁ బోయి వచ్చెద. (అని పోఁ బ్రయత్నింప).

మోహ—కూర్చుండుము. అయిన నాలస్యమైనది. కొంత ముచ్చటించెదము. విశారదా! శాంతి నికేతనమును గురించి యొకింత నాకెఱింగింపుము.

విశా—మోహనా! దాని కాషెన్ని విషయముల నొప్పి యున్నది. విశ్వభారతికిఁ బుట్టినిల్లు కదా. స్వర్గతుల్యమగు నా శాంతి నికేతనమున నున్న వారికి మామూలు ప్రాపంచిక విషయములు రుచింపవు. అక్కడి నిరాడంబర జీవితము, సర్వసోదర సమత్వ ప్రేమము. పెద్దల యందలి భక్తి మున్నగు వానిని గాని చూడక తీరదు. ప్రకృతి కాంత గడియ కొకసారి నూతన విధానమున సింగారించుకొని యుండి నటులఁ గన్పట్టును. భారత కళాభ్యాసమునే కోరువారి కదియే తగిన యాశ్రమ మన నొప్పు. అక్కడి విద్యార్థుల జీవనమే జీవనము. అక్కడ నుండిన వారికి సర్వులను హృదయ పూర్వకముగఁ బ్రేమించుట, పర పురుషులను సోదర భావమునను, పర స్త్రీలను మాతృ భావమునను బూజించుట ప్రథమ విధియై యున్నది. ఈ దీక్షను నిర్వహింపఁ బ్రాణముల నాహుతము నిత్తురు.

మోహ—ఈ విధులను నిక్కడి విద్యార్థులకు మాత్రము నేర్పుట లేదా ? ఈ విద్యార్థులు అక్కడి విద్యార్థుల వంటివారు కారా?

విశా—అందులకే ముందు అక్కడి విద్యార్థుల జీవనమే జీవనమంటిని.

మోహ—అట్లు.

విశా—తెలిపెదను.

సీ.—జనకుండు పంపిన ♦ ధనముచే జోల్గాడి
చదువక యెందెందొ ♦ చనెడి వారు
శాస్త్రముల్ గురువుచే ♦ సమ్మతినై నేర్చి
చంద్రునిఁ గొలఁగాఁ ♦ జాలు వారు
పంతుల వారినిఁ ♦ బరిహాస మొనరించి
కాలము వృథఁ జేయఁ ♦ గడఁగు వారు
పంపిన డబ్బును ♦ పాడు ముండల కిచ్చి
సుఖ రోగముల చేత ♦ స్రుక్కు వారు

తే. గీ.—భీతి లేకుండ సిగరెట్లఁ ♦ బీల్చు వారు
చెలఁగి మధుసేవఁ జేయఁగఁ ♦ దలఁచు వారు
పలల భక్షణ మొనరించి ♦ మెలఁగు వారు
కానఁ బడరఁట వెదకినఁ ♦ గన్నులార! 3

తొలుత నే నచటి కేగి నపుడా విద్యార్థులఁ జూచి సిగ్గుపడవలసి వచ్చెను. కష్టపడి వారి పద్ధతుల నెల్ల నేర్చుకొని వారిని మించఁ గలిగితిని.

మోహ—ఆలాగా! సరి. నీ దేశాభిమానము, స్వాతంత్ర్యేచ్ఛ నిన్ను కళాశాలను మాన్పించి శాంతి నికేతనమును జూపించెను. అక్కడ నీవు నేర్చిన విద్య యేది.

విశా—నా వీణా కళాభ్యాసనమును గుఱించి వ్రాసిన సంగతి మఱచితివా? సంగీత విద్యలో నా విద్యార్థులకు మిన్నయై ప్రథమ బహుమానమును బడసినదే గాక "గాన విశారద" యను బిరుదమును సంపాదించితిని.

మోహ—సెబాస్! మిత్రమా! ధన్యుఁడ వైతివి. నా కా ప్రాప్తి లేక పోయెనే యని చింతించెద.

విశా—నీ కేమోయి. పట్ట పరీక్షయం దారి తేరితివి. న్యాయవాది వైతివి. ప్రఖ్యాతి గడించితివి. ద్రవ్యము నార్జించు చుంటివి. ఇం కేమి కావలయును.

మోహ—మిత్రమా! నీవు పొఱపాటు పడి యున్నావు. ఇపుడు వంకాయ కొక వకీలు యున్నారు. ఎక్కడ పట్టినను వారే. నేర్పరితనము నెవరును గోరుట లేదు. పోనిమ్ము—ఊఁ—ఇపుడేమి చేయ నెంచితివి.

విశా—నే నొక హిందీ పాఠశాలను స్థాపించి హిందీలోఁ గూడ సంగీత విద్యను గూడ నేర్పింపఁ దలఁచితిని.

మోహ—హిందీ నేర్చితివా?

విశా—ఔను. మిత్రమా! మనము రేపు సావకాశముగ ముచ్చటింప వచ్చును. నే గృహమున కేగి మాతృదర్శనము గావించి, తర్వాతఁ బెద్ద తండ్రి గారినిఁ జూడఁ బోవలయును. సెలవా?

మోహ—అబ్బో! నీకుఁ దెలియదు కాఁబోలు. జమీందారు గారు నీ కిపుడు దర్శన మిత్తురా?

విశా—అదే మట్లింపువు. నా యందు వారికి మిక్కిలి ప్రేమ. నేను శాంతి నికేతనమున నుండు నపుడు కూడ నాకు మాసమున కేఁబది రూప్యములఁ బంపు చుండెను. ఆయన విషయము నీకుఁ దెలియక మాటాడెదవు.

మోహ—ఆమాయకుఁ డెవఁడన్న నీవే. నీ కింకను దెలియదు కాఁబోలు. "భువన మోహనరావు" గారు నీవు వివాహ మక్కఱ లేదని శాంతి నికేతనమున కేగిన పిమ్మట; నీ కొఱకు మాటాడిన "ప్రేమ కుమారి" ని నామె జననీ జనకులకు విశేష ధన మొసఁగి తానే వివాహ మాడెను. ప్రేమ కుమారి యిక్కడికి వచ్చి యొక వత్సర మైనది. ఆమె కొక ప్రత్యేక దివ్య హర్మ్యమును నిర్మించి నాఁడు.

విశా—కానిమ్ము. పుత్రుఁడ నగు నా కాయన దర్శనము లభింపక పోదు—మిత్రమా!—ఆ—ఆ—అదికాదు. మా పెద్ద తల్లి యుండ మగల పరిణయ మేల చేసికొనెనో. (యోజన సభిన యించి) ఉ—ఆ సంగతి మన కేల. పోనిమ్ము.

మోహ—అదియుఁ జెప్పెదను వినుము. ప్రథమ భార్య వలన సంతానము లేదఁట. వంశమును నిలుపఁ గోరి ముసలి తనమున ముచ్చటలకుఁ బెండ్లియాడి నాఁడు. పుత్రులు లేక పోయినచో నా ధనమంతయు నీకుఁ బోవునని కాఁబోలు.

విశా—మన కేటికా సంగతి? నే నేగి మా తండ్రిని నిరువురు తల్లులను దర్శించి వత్తును చూడుము.

మోహ—సరి. పోయి రమ్ము.

విశా—ఉదయము వచ్చెదను. (అని వెళ్లెను.)

(యవనిక పడును.)



## ద్వితీయ రంగకము.



స్థలము :—ఉద్యాన వనము.

సమయము :—సాయంకాలము.

జమీందారు గారి యారామ మందిరమునఁ ప్రేమకుమారి కూర్చుండి వీణ వాయించుచు గాన మొనరించుచుండ చెలికత్తె యగు హేమ పుష్పములఁ గోయు చుండును. ఒక బల్లపై నద్దము మరికొన్ని పుస్తకము లుండ, వేఱొక బల్లపై దూరదృష్టి యంత్రము, ఒక ఫిస్తోలు లఘు ఛాయాగ్రాహిణీ యంత్రము (Small Camera) మరియు రెండు ప్రక్కలఁ బూలచెట్ల తొట్లుండును.—

ప్రేమ—(కొంత సేపు వీణాగాన మొనరించి, ఆలోచనము నభినయించి నిస్పృహతో నుస్సురు మనుచు నిర్లక్ష్య భావముతో వాయించెడి వీణియను ప్రక్కనఁ బడవైచి)

తే. గీ. కనికరము లేక గోవులఁ ♦ గట్టి చంపి
పలల మమ్ముచు జీవించు ♦ పాపి కటిక
కంటె, యువతీ లలామల ♦ నమ్ము తండ్రి
యధముఁ డనవచ్చు, కడుహీనుఁ ♦ డనఁగ వాఁడె.— ౪

(నిస్పృహచేఁ)

తే. గీ. కూఁతు నగునేనె యీరీతిఁ ♦ గుందు చుండ
ధనము హరియించి నా పాపి ♦ తండ్రి యకట!
సంతసాంబుధిఁ దేలెడి ♦ జాడఁ జూడఁ
గలియుగపుఁ జర్య లేఁగాకఁ ♦ గలవె వేఱు.— ౫

ఈ వృద్ధ జమీందారు తన ప్రథమ భార్య యుండఁగనే నన్నేల మోసగతిని వరింప వలయు. కారణము బోధ పడుటలేదు కదా. (యోజించి) మొదట నాకు పంపిన ఛాయా పటమునందలి దివ్య సుందర విగ్రహుని గదా నేను త్రికరణ శుద్ధిగ మోహించి పరిణయ మాడఁ గోరితిని. ఆ పటము క్రింద "విశారదుఁడు" అని వ్రాయఁబడి యున్నది. అతనికి నన్ను వివాహముఁ జేయఁ గోరినది ఆ జమీందారుఁడే కదా? అయిన (పైకిఁ జూచి యోచించి) పిమ్మటఁ దానే యీరీతి నన్ను బెండ్లి యాడుటకుఁ గతంబేమి? ఆ మోహనాకారుఁడు నన్ను నిరాకరించెనా? దేశాంతర మేగెనా? లేక మరణించెనా? లేకున్న నే నిక్కడ కేతెంచి వత్సరము దాఁట నుండినను నొకసారి కూడ నా పురుష రత్నము నా కనులఁ బడుటయే లేదే. అకటా! అతఁడు నాకు లభించునో లేదో. అబ్బా! (ఉస్సురుమని)

ఉ.—చొక్కపుఁ బ్రాయముం మిగుల
సోయగముం గల ప్రాణనాయకుం
డెక్కడు వశ్యతం రతుల
నేకటఁ దీర్చి సమేళ మొప్పఁగా
నక్కున గారవించి ప్రియ
మందఁగ నోఁచని యింతిపైన యీ
చక్కదనం బదేమిటికి
జవ్వన మేటికిఁ బ్రాణ మేటికిం.— ౬

వేయేల పొందిన నా విశారదునే పొందవలయు లేదా బ్రహ్మచర్య నియతిని జీవింప వలయుననియు; ఈ నా యాశయమును నెఱవేర్చుకొనుటకు నా ప్రాణముల సహితము నొసంగుటకు వెనుదీయరాదని నిశ్చయించితిని గదా. ఒక వేళ లోకులు తన మనోనిశ్చయ మెట్లుండినను తండ్రి కోర్కి నొకరిని బెండ్లి యాడి యింకొక పురుషునిఁ గోరుట సరి కాదనియు, స్త్రీ కా స్వాతంత్ర్యము నొసఁగక

ముందే విరుద్ధముగఁ జరించె నని దూషించిన దూషింతురు గాక. అది పిచ్చి తలంపు. స్వాతంత్ర్యము నొక కొసంగవలసిన పని లేదు. ప్రతి భారతీయునకును, భారతయువతికిని స్వాతంత్ర్య. మనునది జన్మ స్వత్వమై యుండ దాని నొసఁగు వాఁ డొకఁడు కలఁడా. ఆ మహా భాగుఁడు నాకు లభించుట కల్ల. నా వ్రతదీక్ష ముగియనున్నది. ఇఁక జమీందారు బలవంతము చేయును. (యోజించి) నేను జీవములతో నుండిన గదా అతఁడు బలవంత మొనర్చుట. ఛీ! విశారదుఁడు లేని నా బ్రతు కెందులకు. (అని లేచి పిస్తోలు తీసికొని సవరించుచు) నీవే నాకుశరణ్యము. (అని దూరమున నేమో చూచి నటుల నటించి హేమను చూచి) హేమా! (అని పిలచును)

ప్రవేశము:—హేమ

హేమ—ఏ మమ్మా! (అని లోపలనుండి వచ్చి నిలచును.)

ప్రేమ—(ఇంతకు ముందు చూచిన నైపుణ దృష్టి నిలిపి చూచి యోజించుచుఁ బలుక కుండును.)

హేమ—(చేతులఁ బిసికి కొనుచు వినయముగ) అమ్మా! నా కేమి సెలవు.

ప్రేమ—(కోపమున) ఏమి సెలవు కావలయు. నిన్నుఁ బిలచితినా?

హేమ—(చేతులఁ బిసికి కొనుచు) అమ్మా! ఆ—ఆ—మీ రింతకు ముందు ఊ—ఊ—(అర్ధోక్తి)

ప్రేమ—సరి. నీ ఊ—ఊ చాలింపుము. పుష్పముల సేకరించితివా?

హేమ—చిత్తము.

ప్రేమ—(యోజించి) నీ వేగి నా శయన మందిరమున నే ముప్పా ద్దులఁ బూజించి పుష్ప మాలికలచే నలంకరించు పటమునకుఁ గావలసిన హారములఁ గూర్చు చుండుము. నే నిప్పుడె వత్తును. జాగ్రత. నీ విట నుండక తక్షణము వెళ్లవలయు.

హేమ—చిత్తము. (అని పోవును.)

ప్రేమ—(హేమ వెళ్లు వఱకుఁ జూడ్కుల నిగిడించి చూచి తరువాత ముందు చూచిన ప్రక్కఁ దేటి పాఱఁజూచి) ఎవ్వఁడా నూతన పురుషుఁడు (అని బల్లపై నుండు దూరదృష్టి యంత్రమును Telescope సవరించి చూచి) ఆలాటి పురుని నే నెందో చూచి నటు లున్నది. (అని యోజించి మరల యంత్ర సహాయమునఁ దిలకించి) అమ్మయ్యో! సమీపించెను. (అని బల్లపై నుండు చేతి క్యామరా గైకొని సవరించి బల్లపై నెక్కి ఫోటోను గ్రహించి, మునుపటివలె క్యామరాను ద్రిప్పిపెట్టి, రెండు యంత్రములను గైకొని) ఆ సుందర పురుషుఁ డీదారిననే వచ్చుచున్నాఁడు. ఈ పొద చాటున దాఁగి యేమి చేయునో, యాతఁ డెవరో తెలిసికొన వలయును. ఈ సుందర విగ్రహమును నేఁ బలు నారులు చూచి నటు లున్నయది. (చూడ్కుల నిగిడించి) అమ్మనాన్న! వచ్చెను. వచ్చెను. (అని లతలలో దాఁగి చూచు చుండును).

ప్రవేశము :—

విశారదుఁడు సాయంకాలపు టుడుపుల ధరియించి వన వర్ణనమును దెలిపెడి పాటను బాడుచు విచ్చేయును.—

విశా—(పాట ముగిసిన తోడనే) ఔరా! మా తండ్రిగారి యుద్యానవనము ముందటి కంటె నెంతో ముచ్చటగ నున్నయది. మా తల్లిగారితో మాటాడుచుఁ గొంత యాలస్య మాయెను. ఆయనను జూడఁబోవలయును. పెద్ద తండ్రి గారు వాహ్యాళి కేగక మునుపే దర్శింప వలయు (అని త్వరిత గతి నేగును.)

ప్రేమ—(పొద చాటునుండి త్వరితముగ వచ్చి) ఇతఁడే యితఁడే. నా మనోహరుఁడు. ఏఁడీ. ఎటు లేగెను. (అని వెదకుట నభినయించి) అయ్యో!

ఉ.-సుందర మైనవాఁడు మహిఁ
జూడఁగ నీడును లేని వాఁడు, నా
సందముఁ గూర్చు పద్మనయ
నంబుల నొప్పెడు వాఁడు మానవా
నందముఁ జేయు మీసముల
నాణ్యముఁ గల్గిన నీటుకాఁడయో
యిందుల కేగుదెంచి చనె
నేవిధిఁ జూతునో భాగ్య మెట్టిదో. ౭

(వ్రేలుఁ గఱచి యోజించి) ఏ మనెను. "పెద్దతండ్రి గారు వాహ్యాళి కేగక మునుపే దర్శింపవలయు" అని కదా యనెను. పెద్ద తండ్రి యెవరై యుందురు. ఇచట జమీందారుఁడుకాక యెవరును లేరే. జమీందారుగారినే దర్శింపఁ బోయెనా? నాకుఁజూడ నితఁడు విశారదుని యాకారమున నొప్పుచున్నాఁడు. అతఁడే యై యుండునా. (ఎదపైఁ జేయి నిడి యోజించి) అంతరాత్మ యటా యనుచున్నది. విశారదునకు జమీందారు పెద తండ్రియా? అదెట్టులు? నా కేమియుఁ దోఁచకున్నదే. అయ్యో! అయ్యో! ఎటులేగను?

ఉ.-మోహముఁ గూర్చు నా పురుషు
ముద్దు ముఖంబిపు డక్కటా! నను౯
మోహపు వారిధి౯ జొనిపి
పుచ్చెను, పోవఁగఁ జాలఁ బోయిన౯
మోహపు రూపు నా కనుల
ముందుగ నుండిన యట్లు లుండు నే
మోహము నాపఁ జాల నిఁకఁ
బొందక వాని నదెట్లు లేనియు౯. ౮

(ఇటు నటుఁ జూచి) అతఁడు జమీందారు గారిని దర్శింపక ముందే నే వేఱొక మార్గమున నేఁగి జమీందారు కడ నుండినచో

సన్నియు బయలు పడును. సమీప మార్గమునఁ వెడలెదఁగాక. (అని త్వరితముగ నిష్క్రమించును.) యవనిక పడును.

---

## తృతీయ రంగకము.

స్థలము :—భువన మోహన రావు భవనము.

సమయము :—సాయంకాలము.

భువన మోహన రావు తన భవన కూటమున (Hall) ఆనుకొను కుర్చీపైఁ గూర్చుండి గ్రంథ మును చదువు చుండును.

భువన—(యోజన నభినయించి తటాలున గ్రంథమును మూసి బల్లపై నిడి సులోచనములఁ దీసి రక్షణ పేటికలోఁ Case బెట్టి బల్లపై నిడుచు నాయాసము నభినయించి) ఔరా! "అపుత్రస్య గతి ర్నాస్తిః" యని యీ ముసలి తనమున, అందునను నా సోదరుని పుత్రుఁడగు విశారదునకు మాటాడిన కాంతా రత్నమును ధన సహాయముచే మాయా వివాహమును జేసి కొంటినే. చేసికొన్న దాని కేమి ఫలము. ఆ కాంత నను గన్నెత్తి యైనఁ జూడ నొల్లదు. ఒక వేళఁ జూచిన నెన్నియో విధిలేక సరసోక్తుల నాడును గాని సరసఁ జేర నీదు. అటులఁ జేయుచున్నందున దాని శీలము ననుమానింత మన్న దానికిఁ జోటొసఁగదు. (తలఁగొట్టుకొనుచు) అయ్యో! నేనేమి చేయు దును. నాకు దిక్కు తోఁచ కున్నదే. అకటా! నే నేల యీ యన్యాయమునకుఁ బూను కొంటిని. ప్రేమకుమారి నా గృహ మునకు విచ్చేసి వత్సర మాయెను. ఒక నాఁడైనఁ దన శయ నాగారమున నడుగిడ నీయ లేదు కదా. ఏమి యని యడిగిన నేదో యొక వ్రతమని యో, రోగమని యో, ఋతుకాల

మని యో, యేదో యొక నెపము వెదకుచుందును. ఇఁక నా గతి యింతయేనా. (యోజించి) అకటా!

తే. గీ. వృద్ధులక్కట! సంతాన ♦ వృద్ధికొఱకు
యౌవనస్త్రీలఁ బెండ్లాడ ♦ నేల నొక్కొ?
ప్రేమ ముండదు వారికే ♦ రోమమందుఁ
గలుగు నగుబాట్లు ప్రాణముల్ ♦ దొలఁగుఁ గడకు.

నా వంటి మూఢవృద్ధ జనులెందఱో యీ తీరున వివాహములఁ గావించుకొని యుందురో ఇఁక నెందఱెట్టి ఘాతుకకృత్యములకుఁ బూనుకొని యున్నారో గదా.

ప్రవేశము :—బాలోజి.

బాలో—బాబూ! ప్రేమకుమారిదేవిగారు విచ్చేసి ప్రవేశమును గోరుచున్నారు.

భువన—అభ్యంతర మేమున్నది.

బాలో—చిత్తము (అని పోవును.)

భువన—(యోజన నభినయించి) ఏమిది ఎన్నడును రాని ప్రేమకుమారి నేడు రాఁ గతంబేమై యుండనోపు. ఏదియో విశేషముండక తప్పదు. తెలిసికొందును గాక (అని బల్లపైనుండు గ్రంథమునుగొని చదువుట నభినయించును.)

ప్రవేశము :—ప్రేమకుమారి.

ప్రేమ—(క్రిందిచూపుల నోరకంటఁ జూచుచు వచ్చి మెల్లఁగ) రావచ్చునా?

భువన—(చదివెడి పుటకడ వ్రేలినుంచి మూసి వామకరమున పుస్తకమును బట్టి) ప్రేమకుమారీ! (అని చిఱునవ్వునవ్వుచు) ఏమట్టు లడిగెదవు? రమ్ము. కూర్చుండుము.

ప్రేమ—(కుర్చీమీఁదఁ గూర్చుండును.)

భువన—మనోహరీ!

ప్రేమ—(ఆ మాటకు ముఖము చిట్లించి వేఱొక ప్రక్కకుఁ జూచును.)

భువన—ఎన్నఁడును రాని దాన వేల నేఁడు విచ్చేసితివి. ఏముందర పని యుండినదా? అట్టులైన సేవకునితో సందేశ మంపి యుండిన వచ్చి యుందునే. నిన్ను సందర్శించుటకును, నీతో మాటాడుటకును, నీ ప్రేమ జూచుకొనుటకును, నీ యధరామృతమును తనివిఁ దీరఁ గ్రోలుటకును, నీ ప్రక్కఁ (అర్ధోక్తి)

ప్రేమ—చాలును. చాలును. నా మాటపడదా? అట్టులైనచో వెళ్లెదను. (అని పోఁ బ్రయత్నించి) నాకొఱకె వచ్చితి నంతయేగా. కాని (అర్ధోక్తి)

భువన—(కుర్చీనుండి లేచుచు) అటులకాదు ప్రేమకుమారీ! కోపగింపకుము. నీవు రాఁగూడదని కాదు. నే నెల్లప్పుడును నీ రాకనే కోరుచుందును గదా? కూర్చుండుము (అని కరమును బట్టఁ బోవును.)

ప్రేమ—(కరము నొసఁగక కోప స్వభావముతో) ఔ నౌను. (అని తానే కూర్చుండి అటునిటుఁ జూచును.)

భువన—(అటునిటుఁ జూచి) ప్రేమా! ఏమటులఁ జూచితివి. నాతోని వ్యక్తు లెవరును లేరులెమ్ము.

ప్రేమ—ఏ మా యనుమానము? ప్రక్కకుఁ జూడనే రాదా? (అని గ్రంథమును జూచి) ఆ గ్రంథ మేమి? ఇటు లెమ్ము. (అని పొత్తమును గొని తెఱచి చదువుట నభినయించి) ఎవఁడో కవి గాఁడు. ఇంత పక్షపాతమా. ఔరా! యీ పురుష సాహసము.

భువన—ఏమి ప్రేమ కుమారీ! ఏమి వ్రాసినాఁడు. అతఁడు మిక్కిలి గుణవంతుఁడని లోకు లనుచుందురు.

ప్రేమ — ఔను. మిక్కిలి మంచి వాఁడు. ఈ పద్యమును చదువుఁడు.
(అని పొత్తము నొసఁగి పద్యమును చూపును.)

భువన — (గ్రంథమును బుట మాఱు పడకుండఁ దొడలపైఁ దెఱచి యుంచి బల్లపై నుండు సులోచనములఁ దుడిచి ధరించి గ్రంథమునుఁ జూచి)

సీ. — హా! సాధ్వులై యున్న ♦ పస లేని వాఁడని
మిగులఁ గృతఘ్నులై ♦ మెలఁగు వారు
కనకంపుఁ జీరల ♦ ఘనమగు సొమ్ములఁ
గొని దెమ్మనుచు గొంతెమఁ ♦ గోయు వారు
పరపూరుషుని గోరి ♦ భర్త యడ్డమటంచు
మగ్గు మందుల నిడి ♦ మరలు వారు
విటుని మాయకు లొంగి ♦ తెగుకొనఁ బతిఁబట్టి
కుత్తుకఁ గత్తిచేఁ ♦ గోయు వారు

తే. గీ. — భర్త దండింప నాపెకి ♦ బాఱు వారు
అత్త మామలఁ బట్టి తా ♦ మొత్తు వారు
చెప్ప రానట్టి కార్యముల్ ♦ చేయు వారు
కలరు వేనవేల్ కలియుగ ♦ కాంత లందు. — ౧౧

సెబాస్! ఎంత బాగుగ వ్రాసి యున్నాఁడు. కలియుగపు స్త్రీల దుండగములను గనులఁ గట్టినట్లు వ్రాసినాఁడు కదా. ఎంత సులభశైలిని వ్రాసి యున్నాఁడో చూడుము. ఇందతని దోస మేమున్నదని నిరసించెదవు.

ప్రేమ — (సిగ్గుతో భావము) కాను. స్త్రీలలోఁ గొందఱే దుండగములను రచించిన కవి పురుషుల దుర్ణయముల నేల వ్రాసిన వాఁడు కాఁడు. (అని యోచన సభిన యించి)

సీ. — కులసతులను గొని ♦ వెల వెలందులకును
బానిసగాఁ జేయు ♦ పాపి జనులు

పుత్రులు లేరని ♦ ముసలి పీనుఁగు లయ్యు
రెండవ సతిని వ ♦ రించు నరులు
ప్రక్కకుఁ జూచినఁ ♦ బరులఁ జూచె నటంచు
ననువరాని పడి తిట్లు ♦ నధమ జనులు
పడసాని నితరులు ♦ పరికింప రాదని
బయట కేగఁగ నీని ♦ పాప నరులు
తే. గీ. వట్టి నిందలఁ గల్పించి ♦ కొట్టు జనులు
భార్యలను గాచి కొనియుండు ♦ భ్రష్టు లకట!
కవికిఁ గనఁబడ లేదొకో ♦ కాని భంగిఁ
జెనుగు లను వ్రాయ స్త్రీలప్పెఁ ♦ జెప్పును మీరె. — ౧౧

భువన — ప్రేయసీ! నీవు ఆశుక (అర్ధోక్తి)

ప్రేమ — (ముఖము చిట్లించి) ఊఁ - సావధానత వినుఁడు.

సీ. — పొగఁబీల్చు నలవాటు ♦ పోసగ దనెడు వారె
గుప్పు గుప్పున పొగల్ ♦ గుప్పు వారు
మధుసేవఁ జేయుట ♦ పనికిరా దను వారె
సారాయి త్రావంగఁ ♦ గోరు వారు
కోవెలంపుల పొందు ♦ కోఁత యనెడు వారె
సొమ్ముకై గుడిసెలో ♦ దూరు వారు
పరసతి నంటుట ♦ పాప మనెడు వారె
మిత్రద్రోహముఁ జేసి ♦ మెలఁగు వారు
తే. గీ. జానిసత్వము వలదని ♦ పాడు వారె
కొరల చుట్టును పలుమారుఁ ♦ దిరుగు వారు
వ్రాయుదురె కాని కవులిల ♦ వలసినన్ని
వ్రాసి నట్టుల నడుచురు ♦ వారి కేమొ. — ౧౨

కవి పుంగవులు తమకే స్వాతంత్ర్య మున్నదని యిచ్చ వచ్చిన భంగి వ్రాయుచుందురు. నేను గూడ పద్యముల నల్లఁ గలను. వ్రాసి

నటుల నడుమ కోసినఁ గదా వ్రాసిన దానికి ఫలము "చెప్పు వారికిఁ జేతలుఁ జేతఁ గావు" అను నట్లు చేసిన నేమి ప్రయోజనము. (అని ప్రక్కకు నిటు నటుఁ జూచును.)

భువన—కవయిత్రీ! నీవు కవిత్వ మెపుడు నేర్చితివి. ఈ పద్యములు నీవే రచించితివా?

ప్రేమ—(ప్రక్కకుఁ జూచుచుఁ బలుక కుండును.)

భువన—పలుక వేమి ప్రేమ కుమారీ? ఎవ్వరైన వచ్చు చున్నారా?

ప్రేమ—(ముఖము చిట్లించి) అక్కా!—అంత తొందర నేల. ఔను నేనే యాశువుగఁ జెప్పితిని.

భువన—(ఆశ్చర్యమున) అహో! ఆశుకవిత్వమే—ఎప్పుడు నేర్చితివి ప్రేమకుమారీ!

ప్రేమ—ఆ శారదాదేవి కృప నాయందుండఁ గవిత్వమే రాకుండునా? (అని ప్రక్కకుఁ జూచి లోపల సంతోషించుచు) ఎవరో నూతన పురుషుఁడు వచ్చు చున్నట్లు లున్నది. నే వెళ్లుదునా?

భువన—(ప్రక్కకుఁ జూచి) ఉండుము. పోవలదు. మన విశారదుఁడే. ఔరా! నేఁడు గదా సుదినము.

ప్రేమ—(ఆశ్చర్యమున) ఆ-ఆ-ఏమీ! విశారదుఁడా?

ప్రవేశము:—విశారదుఁడు.

విశా—(వచ్చుచు) తల్లీ! ఇదే నా భక్తి పూర్వక సాష్టాంగ నమస్కారములను స్వీకరింపఁ బ్రార్థించెద. (అని సాష్టాంగ నమస్కార మొనరించును.)

భువన—(లేచి వచ్చి) శుభమగు గాత. నాయనా! విశారదా! లెమ్ము. (అని లేపుట నభినయించును.)

విశా—(లేచి) తండ్రీ! మీకుఁ గుశలమే కదా. మా తల్లి సేమముగ నున్నదే. (ప్రేమకుమారిని జూచి) ఈ సాధ్వీమ తల్లి యెవరు?

ప్రేమ—(తల యూఁచి మెచ్చుచు నోరగంటఁ జూచి చూడనట్లుండును.)

భువన—ఈమె నీ పినతల్లి ప్రేమకుమారి (అర్ధోక్తి)

ప్రేమ—(ఆ మాటకు అసూయచేఁ దలఁ ద్రిప్పుకొని కూర్చుండును.)

విశా—అమ్మా! వందనములఁ గైకొనుము. (అని నమస్కరించును.)

ప్రేమ—ఆ—(అని ముక్కుపై వ్రేలిడి) కళ్యాణమగుఁ గాక. (అని యోరగంటఁ జూచి చిఱునగవు నభినయించును.)

భువన—విశారదా! కూర్చుండుము.

విశా—(క్రిందఁ దండ్రికి సమీపముగఁ గూర్చొనుచుండ)

ప్రేమ—(భువనమోహనరావుతో) పీఠము మీఁద గూర్చుండు మనుఁడు. (అని తాను లేచును.)

భువన—నాయనా! అక్కడఁ గూర్చుండుము.

విశా—వలదు. వలదు. నే నిక్కడనే కూర్చుండెదను.

ప్రేమ—వలదు. వలదు. (భువనమోహనరావును జూచి) పని సేవకుఁ డెచ్చటి కేగెను.

భువన—సేవకా!

శాలో—(లోపల నుండి) బాబూ! ఆజ్ఞ.

భువన—త్వరితముగ నొక కుర్చీని తెమ్ము.

ప్రవేశము:—శాలోకు.

శాలో—(కుర్చీని తెచ్చి పెట్టి పోవును.)

భువన—విశారదా! నీ వా కుర్చీపైఁ గూర్చుండుము.

విశా—(నిలువఁబడి యుండు వాఁడు వెళ్లి కుర్చీపైఁ గూర్చుండును.)

ప్రేమ—(విశారదుఁడు ఆసీనుఁడైన పిదపఁ దానుఁ గూర్చుండి యోర కంటఁ జూచుట నభినయించు చుండును.)

భువన—నాయనా! నీవు నేఁడే వచ్చితివా?

విశా—అవును. నేఁడు మధ్యాహ్నము సుమారు మూఁడు గంటలకు వచ్చితిని.

భువన—నాయనా! విశారదా! నీ విద్య పూర్తి కావించుకొని వచ్చి తివా? లేక మరలఁ బోవలయునా?

విశా—లేదు సాంతముగ నభ్యసించియే వచ్చితిని. మీ కపకీర్తిఁ దెత్తునా? వీణా వాదుల కొక పోటీ పరీక్ష నిడిరి. అందులో నేను ప్రథమ బహుమానమును గడించినదే గాక "గాన విశారద" యను బిరుదమును బడసి వచ్చితిని.

భువన—సెబాస్! నీ వన్నిటను మెచ్చఁ దగిన వాఁడవు.

ప్రేమ—(సంతోషముతో తల నాడించుచు స్వగతమున) మిక్కిలి యనుకూలము. ఇదే సమయము. (అని జడలో నిడియున్న పెన్సిలును గైకొని దగ్గఱ చేత నున్న చిన్న సంచిలో దాఁచిన చిన్న కాగితములో నేమో వ్రాసి భువన మోహనరావుమీఁద మెల్లఁగ విశారదుని యోరగంటఁ జూచుచుఁ బడవేయును.)

భువన—(కాగితమును జూచుకొని) విశారదా! నీ వేమి చేయఁ దలం చితివో నా కెఱింగింపుము. నీకుఁ గావలసిన ధన సహాయ మొనరించెదను.

విశా—(అంత వఱకు వేరొక ప్రక్కఁ జూచుట నటించి) తండ్రీ! నీ వున్నంత కాలము నా కేమియుఁ గొఱఁత లేదు. పురుషుఁ డనై యూరకఁ గాలమును వృథఁ జేయ బుద్ధి పుట్టుట లేదు. కనుక నే నొక హిందీ పాఠశాలను స్థాపించి మన యూరి బాల బాలికలకు హిందీ భాషనే గాక సంగీత వీణా వాద్య

ములను నేర్పుచుఁ దీక్షిక దొరకినపు డంతయు సంఘ దేశ సేవలఁ జేయఁ దలఁచితిని.

భువన—విశారదా! నీ విప్పుడె పాఠశాలను స్థాపింప నక్కఱ లేదు. (ప్రేమ కుమారి కాగితమును జూపుచు) ప్రేమ కుమారి వీణా వాద్యమును నేర్చుకొనఁ దలఁచినది. కొంత వఱకు అభ్యసించి నే యున్నది. ఇంకఁ గొంత కాలము నీవు నేర్పక తప్పదు.

ప్రేమ—(తన కాగితమును జూపు నపుడు ప్రేలు గఱచి ముఖము చిట్లించి తన యనభి మతమును జూపును)

విశా—(అను మానించి పలుక కుండును)

భువన—ఏమి విశారదా! ప్రత్యుత్తర మీయవు? నీకు సమ్మతి లేదా? నన్ను నిరాకరింతువా?

విశా—(తడబడుచు) ఊ—లేదు. లేదు. మీ మాట మీరఁ గలనా? సంతోషమున మీ యాజ్ఞ నెర వేర్తును. రేపటి నుండియే ప్రారంభింతును. సెలవా?

భువన—మంచిది. నాకును క్లబ్బుకుఁ బోవు వేళ యైనది. ప్రేమ కుమారి తన సూరామ హర్మ్యమున నుండును. నీ వను దినము నిరాటంకముగ వెళ్లి యా కళ నేర్ప వచ్చును. నేను విశ్రాంతి భవనమునకు (clmb) నా మోటారుతో వెళ్లెదను. నిన్ను నీ యింటికడ వదలి పోదును రమ్ము. (అని విశారదుని చేయిఁ బట్టి పిలుచుకొని పోవుచుఁ ప్రేమకుమారితో) ప్రేయసీ! నీ హర్మ్యమునకుఁ బోదువా? లేక నేఁ డిందే యుందువా?

ప్రేమ—(ఇంకొక ప్రక్కఁ జూచుచు) వెళ్లెదను.

భువన—మంచిది. (అని విశారదునితో నిష్క్రమించును)

ప్రేమ—(అతి సంతోషముతో నుబ్బినదై) ఔరా! నా కిది గదా సుదినము. నే ధన్య నైతిని. నే నెవరి ఛాయాపటమును

ప్రథమమునఁ దిలకించి మోహించి ప్రేమించితినో ఆ నా మనోహరుని కన్నులారఁ గాంచఁ గల్గితిని. అదియుఁ గాక నా మందిరమునకుఁ బిలిపించుకొనఁ గలిగితిని. ఒక నిమేష మాత్రమున నీ యుపాయమును జేసిన నాకు, సను దినము నా మందిరమునకు వచ్చెడి విశారదుని లోఁ బఱచు కొనుటఁ (నిర్లక్ష్య భావముతో చిటిక వేయుచు) ఉః—(తల యూఁచి) నా కొక లెక్కయా. గొప్ప గొప్ప ఋషికుల పుంగవులే తామరస నేత్రలకు లొంగి యుండ నీ విశార (అర్ధోక్తి) కాదు కాదు (అని తల యూఁచుచు) నా విశారదుఁడు నాకు లభింపఁడా. ఈ కార్యమున నా నేర్పుఁ జూప వలయు.

(అని నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.

# ప్రేమకుమారి.



## ద్వితీయాంకము.

(ప్రథమ రంగకము)

స్థలము :—మోహనరావు భవనము.

సమయము :—ఉదయ మెనిమిది గంటలు.

మోహనరావు తన భవనమున ఆనుకోను కుర్చీ పైఁ గూర్చుండి గ్రంథమును చూచుచుండును.

మోహ—(తటాలున గ్రంథము నందలి పుట చివరను మడిచి మూసి బల్లపై నిడి కంటి యద్దములను దీసి) నిన్నటి సాయంకాల మేగిన నా మిత్రుఁడు విశారదుఁడు రాత్రి రాక పోయినది గాక నేఁడు ఇంత ప్రొద్దెక్కు వఱకు రాకుండుటకు హేతు వేమి. ఈ దినము న్యాయస్థానమున నభియోగములు లేసందున మిత్రునితోఁ గులాసాగాఁ గాలము గడుప నెంచితిని. సేవకునిఁ బంపి పిలిపింతునా (యోజించి) గృహము కడనుండునో లేక జమీందారు గారి కడ కేగి యుండునో. (ప్రక్కకుఁ జూచి) వచ్చెను.వచ్చెను. (అని లేచి ముందున కేగి) విశారదా! రమ్ము.ఇంత యాలస్య మేల ?

ప్రవేశము :—విశారదుఁడు.

విశా—(మోహనరావును గలిసికొని) ఏమోయీ! ఇంకను నెనిమిది (చేతి గడియారమును చూచుట నభినయించి) గంటలు కూడ కాలేదు కదా. (అని యిరువురుఁ గూర్చుందురు.)

మోహ—నీవు లేకున్న నా కొక నిమిష మొక గంట యగును. ఇన్ని దినములు నీ పూర్ణ లేనందున నా కెటులుండె ననుకొంటివి. ఏప్పుడును నీ విచారమే. ఆప్త బంధువుల కంటె నాప్త మిత్రుఁ డొకఁ డుండినఁ జాలును.

విశా—మోహనా! నాకు నీ తొందరయే లేకుండిన మఱియొక వత్సర మచ్చటనే యుండెడి వాఁడను గాని నాకును నీ మీఁది చింతయే. శాంతినికేతన మైనందున నిన్ని దినము లుండఁ గలిగితిని కాని లేకున్న నెప్పుడో పరుగెత్తి వచ్చి యుందును.

మోహ—నీ తల్లిపై (అర్ధోక్తి)

విశా—తల్లిపైఁ జింత నాకు బొత్తిగ లేకుండెను. ఆ భారమును నీపై వదలి యుంటిని గదా.

మోహ—భార మేమియును లేదు. ఈ మాటలతో నేమి కాని నిన్న సంజకడ జమీందారు గారిని దర్శింపఁ బోయితివి కదా? దర్శనము లభించెనా?

విశా—ఏల లభింపదు. నే నేగు నప్పటికి మా తండ్రిగారు గృహమున మా పినతల్లి గారితో ముచ్చటించు చుండ దర్శించితిని.

మోహ—(ఆశ్చర్యమున) అసత్యముల నెన్నఁడు నేర్చితివి.

విశా—(తొందరగ) ఆ—ఆ—అసత్యమా. మిత్రమా, పొఱపాటు పడితివి.

మోహ—సత్యమా. నే నమ్మఁజాల. ప్రేమకుమారీ దేవి, జమీం దారుగా రామె యారామ మందిరమున కేగి బ్రతిమాలినను మాటాడుట కష్టసాధ్యమై యుండ; ఆమె జమీందారు గారి నికేతనమున కేగఁ గలదా? భువనమోహన రావుగారు దిన మంతయుఁ గాచుకొని యుండిన నొకటి రెండు మాటలు మాత్రము మాటాడి పంపుచుండు నని విన్నాను. ఆమె తనం

తకుఁ దానె యాతని గృహమున కేగిన దని విన నా కిం దేదో విశేషము కలదని తోఁచు చున్నది. (యోజించి) అయిన విశారదా! నీ వే మార్గమునఁ బోయితివి.

విశా—ఏ దారిఁ బోయిన నేమి. ఆ రామ మార్గమున నే వెళ్లితిని.

మోహ—సరి. నీ వారామ మార్గమునఁ బోలేదు. కాని యా రామ మార్గమునఁ బోయియుందువు. కాని (అని తల యూఁచును.)

విశా—ఏమోయీ! యోజించెదవు.

మోహ—ఏమియును లేదు. నీ వేగు నప్పటికి వా రేమి మాటాడు చుండిరి.

విశా—నే వినలేదు. నేను వెళ్లి సాష్టాంగ నమస్కార మొనరించి తండ్రిగారి సేమమును, తల్లి గారి సేమమును విచారించి, తండ్రి గారి వలన మా పినతల్లి గారిని దెలిసికొని నమస్కరించితిని. నేఁ గ్రిందఁ గూర్చుండు చుండ (పశ్చాత్తాపముఁ గనఁ బఱచి) పాపము! మా పినతల్లిగారు వేఱొక కుర్చీని దెప్పించినను గౌరవించెను. నా యందు మిక్కిలి ప్రేమఁ గనఁ బఱచి నటుల నటించెను. ఎంత యైనను తల్లికిఁ బుత్రునిపై నంత మాత్రము దయ యుండదా? (పొఱపాటు నభినయించి) మిత్రమా! అంతియే కాదు. మా తండ్రిగారి నడిగి యాయన నొప్పించి తనకు వీణ నేర్పించునటులఁ జేయ, ఆయనగారు నన్ను హిందీ పాఠశాలను స్థాపింప వలదనియుఁ బ్రేమ కుమారి కను దినము వీణ నేర్పుచుండ వలెననియుఁ గట్టడి చేసెను. నేను గూడ సమ్మతింపక తప్ప దాయెను.

మోహ—(విచారముతో) అయ్యో! నీ వన్నిఁటఁ జెడితివి. (యోజ నతోఁ దల యూఁచి) విశారదా! మరి ఒక మాట నీకంటె నా కాప్తులు లేరని మిక్కిలి ప్రేమించి నీ కొఱకు నా ప్రాణ ముల నర్పింపఁ గోరితిని. నీ కరమిటు తెమ్ము. (అని చేతిలోఁ

జేయి వైచి.) ఈ మాటఁ ద్రికరణశుద్ధిగఁ జెప్పితిని. నా విషయము చిన్న తనమునుండియుఁ జూచు చుంటివి. నా కంటె నీకాప్తు లెవరైన నుండినఁ జెప్పుము.

విశా—ఏమి మోహనా! పిచ్చిమాట లాడుచుంటివి. ఏమి దేహ మస్వస్థతగ నున్నదా? (అని లేచుట నభినయించి) విశ్రాంతి గైకొనుము. మరల వచ్చెదను.

మోహ—(విశారదుని బట్టి కూర్చుండ నియమించి) నా కేమియు లేదు. ఆరోగ్యముగ నుంటిని. చెప్పుము. నా కంటె నాప్త మిత్రు లుండిరా?

విశా—(విసుగుతో) అబ్బా, ఏమోయి యీ దిన మిట్టు లనుచుంటివి. నాకీ ప్రపంచమున నీ జన్మమున నీకంటె నాప్త మిత్రుఁడు లేఁడని నొక్కి చెప్పు చుంటిని. నీ కీ యనుమాన మేల? (అని మోహనరావు చేతిలోఁ జేయి వైచును.)

మోహ—అటులైన నా కోర్కె యెట్టి దైనను నెఱవేర్తువు కదా?

విశా—మోహనా! నాయందు నీ కిట్టి సంశయ మేల కల్గెను. ఇది నా దురదృష్టమా?

మోహ—కాదు. కాదు. నా దురదృష్టము. నా ప్రశ్నకుఁ బ్రత్యుత్తర మొసఁగుము.

విశా—అబ్బా! నన్ను విడుచునట్లు లేదే. (లేచి యోజించి స్వగతమున) ఇతఁడు నేను మా పినతల్లిగారికి వీణ నేర్పుటకు సమ్మతించితి నని చెప్పి నప్పటి నుండియు నిట్టి మాట లాడు చున్నాఁడు. ఈ నా కార్యమునకుఁ దాను సమ్మతించి నటుల లేదు. ప్రేమ కుమారి దేవియం దీతని కేదియో యనుమాన ముండి నటులఁ దోఁచెడిని. ఇపుడు నిరాకరించిన నా తండ్రి యాజ్ఞను నుల్లంఘించిన వాఁడ నగుదును. అంత కంటె పాప కార్యముగలదా? విశారదుఁడు తన జీవము లున్నంత వఱకు తలిదండ్రులకు

ద్రోహముఁ జేసి యీ లోకమున నపవాదములఁ బడఁ జాలడు. (మోహనరావును జూచి) మోహనా! ఇంచుక యోజింప నిమ్ము. (మరల స్వగతమున) అయిన మిత్రుని మాటను నే నెటులఁ గాదందును. (ఉస్సురు మనుచు) అబ్బా! ఏమియుఁ దోఁచ కున్నదే. (అని లేచి ముందున కేగి) ఆప్త మిత్రుని మాటను నిరాకరించిన నే బ్రతికి ఫలమేమి. ప్రాణములనైన వదల వచ్చును గాని ప్రాణ సఖుని మాటను వృధఁ జేయఁ జాల. (యోజించి) సరి (అని తల యూఁచుచు) నేను జనకాజ్ఞను బాలింప వలయును, మిత్రుని కోరికను సైతము చేయ వలయును. నే నీ కార్యమునకుఁ బూనుకొనుట తప్ప నింత వఱకు నా తలపై నితర భారమును వేసికొన లేదు. కనుక (యోజించి తల యూఁచి) ఈ విధముగా బ్రత్యుత్తర మిచ్చెద. (అని వచ్చి కూర్చుండి ప్రకాశముగ) మోహనా! సరి. నాకంటె నీ కాప్తు లెవరును లేరని నమ్మెద.

మోహ—సంశయ మే మున్నయది (యోజించును)

విశా—అయిన నా కోర్కె యెట్టిదైన యున్నఁ దీర్ప వెనుదీయ వని యనుకొనియెద.

మోహ—(స్వగతమున) ఓహో! ఇతఁడు గ్రహించినటు లున్నది. ఇపుడేమి చేయ వలయును. (యోజించి) విశారదా! ముందడిగినది నేను నాకు మొదట నుత్తర మిమ్ము. తర్వాత నీ సంగతిఁ జూడక తప్పను.

విశా—అటు కాదు. మనకు ముందు వెనుక లేమి. ఇరువురమును నొకరికై యొక రెట్టి సాహస సత్కార్యముల నైనఁ జేయ వెనుదీయ రాదని ప్రతిజ్ఞ యొనరించితము.

మోహ—(స్వగతము) ఇతఁ డసాధ్యుఁడు. ఏమి చేయుదును? (విసుఁగుచేఁ దలఁ ద్రిప్పిచేయి విదలించు కొనుచు) అబ్బా! ఉపాయ ము తోఁచదే.

విశా—మిత్రమా! ఏల యోజింతువు. దీని వలన భయ మేమున్నది. కానిమ్ము. హస్తమును జాచుము. (అని తన చేయిఁ జాచును)

మోహ—(యోజించుచు మెల్లఁగాఁ జేతినిఁ గలుపును.)

విశా—అన్నా! ఇఁక ముందు నీ కోర్కెఁ దెలుపుము.

మోహ—(నిస్పృహచే) ఇఁకఁ జెప్పిన నేమి చెప్పకున్న నేమి ఎందులకు లెమ్ము.

విశా—ఊహూ! (తలఁ ద్రిప్పుచు) చెప్పిన దోస మేమి. ఏమి తలఁచి యుంటివో వినఁ గోరెద. చెప్పక తప్పదు.

మోహ—(నిరుత్సాహముతో) నిన్నుఁ బ్రేమ కుమారి దేవికి వీణ నేర్పుటకుఁ బోకుండఁ జేయఁ గోరి యుంటిని.

విశా—(వెంటనే) ఆ—ఆ—నే ననుకొనినదియు నదియే. దానికే నేనును నీ వలనఁ బ్రతినఁ గొంటిని. అది కాని పని. మా తండ్రి గారిని జూడక మునుపు అనఁగా నిన్నటి దినమేల చెప్పక పోయితివి? నీ మాటను శిరసా వహించి విని యుందునే. ఇపుడు నిరాకరించినచోఁ దండ్రి యాజ్ఞ నుల్లంఘించిన పాపమున బోదును. అది నేఁ జేయఁ జాల. అది కాదు మిత్రమా! ఆమె కా విద్య నేర్పఁ బోయినఁ దప్పేమి?

మోహ—తప్పేమియు లేదు. ప్రాణోపద్రవము.

విశా—ఆ-ఆ-ఏమోయి. అట్టు లనెదవు. ఎందులకు?

మోహ—ఆమె యొంటిరిగ నుండు నారామ మందిరమునకు గదా నీ వా విద్యను నేర్పఁ బోదువు.

విశా—అవును. పోయిన.

మోహ—ఆమె మిక్కిలి సౌందర్యవతి. నవయౌవనవతి. నీవు రూపరేఖా విలాసములఁ దక్కువ వాఁడవు కాదు. అందు వలన నిన్నామె మో (అర్ధోక్తి)

విశా—(ఇంచుక కోపము నభినయించి) మోహనా! చాలును జాలును యోజింపక మాటాడకుము. ఆమె శీలమును గుర్తెఱుఁగక మాటాడరాదు. మన మాప్తుల మైనందున విని యూర కుండక తప్పినది కాదు.

మోహ—మిత్రమా! నీ వీ యూర లేనందున నీ కొక్కటియుఁ దెలి యక మాటాడు చుంటివి. నీవు గ్రామాంతర మేగి నప్పటి నుండియుఁ బ్రేమకుమారి వివాహము జరిగిన దాదిగ రహస్య ముగ నన్నిటిని దెలిసికొను చున్నాను. అదియుఁ గాక.

చ.—పెనిమిటి రోగి యైన, మఱు
పెండ్లియు నాడిన, కన్నెనాఁడు చుం
బనమును యౌవనంపు నునుఁ
బల్కులఁ దేటిన, భృత్యునింటఁ దా
మనఁగల గంధమంగళిత,
మత్త కుపూరుష కాంత, వృద్ధు సం
గనయును, యోగి కాంతయును
గాంచరు మంచియుఁ జెడ్డ లిద్దరె.— ౧3

(ఎఱ్ఱయామాత్య కవి)

ఇందొక్కటి యున్న స్త్రీలే పెడ దారిని బ్రవర్తింతు రన్న మన ప్రేమకుమారీ దేవికి రెండు తటస్థించినవి. మొదటిది భర్త రెండవ వివాహమును జేసికొని యుండుట. రెండవది తాను వృద్ధు నంగనయై యుండుట నీ యిష్టము.

విశా—అనుభవము లేక వ్రాసిన కవి పలుకులఁ గని యట్టు లనకుము (ఇంచుక కోపమున) మోహనా! ఇఁక నీ వామె విషయమై అలాగు మాటాడకుము. మిత్రుఁడవగు నీ కింతకంటెఁ గఠిన ముగఁ జెప్ప వలసిన పని నాకు లేదు.

మోహ—(వ్యసనముతో) అయ్యో! మిత్రమా! (అని చేతులఁ బట్టుకొని) నా పలుకు లాలకింపుము. ఎన్నఁడును నాకుఁ బ్రత్యుత్తర మియ్యని వాఁడవు నేఁడిట్టి దుర్బుద్ధికి లోనైతివే. అక్క విపుంగవుని పలుకులు యథార్థము. అతఁడు మిక్కిలి యనుభవముఁ గల వాఁడని జగంబులు పొగడుచున్నవి. అనుభవము లేక మాటాడకుము. అయ్యో! నాకుఁ దక్కుదువో లేదో. (అని కన్నుల నీటిని దుడుచు కొనును.)

విశా—అన్నా! ఏల దుఃఖింతువు. నీవు భయపడ నక్కఱ లేదు. (అని భుజముపైఁ జేయి వైచి గడ్డమును బట్టి) నా స్థిరమగు నడవడిఁ దెలిసియు ననుమానింతువా? సంశయింపకుము. మదీయ వంశమునకుఁ గళంకముఁ దేను. నీ కపఖ్యాతి రాకుండ నడచు కొనెదను.

మోహ—మిత్రమా! ఇది కలియుగము. నీవుఁ గలియుగపు వాఁడవే. పూర్వపు యుగములు పూర్వపు వారైన నేమో గాని మనకు సాధ్య (అర్ధోక్తి).

విశా—అన్నా! భ్రాంతి పడితివి. పూర్వపు యుగములలో నవినీతిపరులు లేరా? ఈ యుగమున నీతి కోవిదు లుండరా? చూచెదవు గాక. (చేతి గడియారమును జూచి) వేళ యైనది. జనని నా కొఱకుఁ గాచుకొని యుండును. సెలవా.

మోహ—(వ్యసనమున) విశారదా! పోయెదవా?

విశా—(నవ్వుచు) అన్నా! ఇంత వెఱ్ఱివాఁడ వైతివి. నే జితేంద్రియుఁడనై యుండఁ గల నని నమ్ముము.

సీ.—దినమణి విధితప్పి ♦ దేశ సంచారంబుఁ
జేసిన మనసారఁ ♦ జేయుఁ గాత
భూమాత చలనంబుఁ ♦ బోనాడి యొక్కచే
చోటున నిల్వఁగాఁ ♦ జూడుఁ గాత

ఆకస మొక రూపు ♦ జోకతోఁ గైకొని
చూపరులకుఁ బొడ ♦ చూపుఁ గాత
తారకా మండలి ♦ తమయున్కిఁ గోల్పోయి
చిక్కి యదృశ్యమై ♦ చెలఁగుఁ గాత

తే. గీ. తండ్రి యాజ్ఞను మీఱను ♦ దల్లియందుఁ
జేయ ద్రోహంబు నీ యాన ♦ స్థిరము గాను
ప్రజలకట! విశారదు వంటి ♦ వారు లేరు
వసుధ లేరంచు తల లూఁప ♦ వలదె సఖుఁడ. ౧౪

(అని నిష్క్రమించును)

మోహ—(తలయూపి యుస్సురు మనుచు) ఇతఁడు తప్పక ప్రేమ కుమారిచే వంచింపఁ బడి యాపదలకుఁ జిక్కక పోఁడు. నా శక్తికొలఁది నీతనినిఁ గాపాడుకొనఁ బ్రయత్నించెదఁ గాక.

(అని లేచుచుండ యవనిక పడును.)

---

## ద్వితీయ రంగకము



స్థలము :—ప్రేమ కుమారి యారామ మందిరము.

సమయము :—సాయంకాలము.

ప్రేమ కుమారి యారామ మందిరమున సోఫా మీఁదఁ గూర్చుండి యుండును. ఇరు ప్రక్కల బల్ల లుండును. పూలతొట్లు మొదలగు వానిచే నలంకరించి యుండును. ఒక బల్లపై పెద్ద యద్దమును; యింకొక బల్లపైఁ బుష్ప మాలికలచే నలంకరింపఁ బడిన చిత్ర ఫలక ముండును.

ప్రక్కన వీణయుఁ గొన్ని గ్రంథములును నుం
డును. అద్ద ముండిన బల్లపై రత్న కంబళము
నుంచి యుండును.—

ప్రేమ—(తదేక దృష్టితో బల్లపై నుండు పటమును దిలకించుచుఁ దల యూఁచి నిట్టూర్పు విడిచి)

ఉ.—ఈ పటమందుఁ గాంచి తగు
నీతఁడె నా కని యాత్మ మెచ్చి, నే
నాపఁగ లేక మోహమును
హా! యెటుఁ జూతునొ చూచి నంత, నే
నే పగిదిన్ విశారదుని
యీ సదనంబునఁ జేర్తుఁ జేర్చుచో
నా పయిఁ బ్రేమ నిల్పుమని
నాదు మనోహరుఁ గోరు టెప్పుడో.— ౧౫

(అని లేచి యటు నిటుఁ జూచి) అని అత్యాతురతతో నుండ నేటికి నాకా యదను లభింప నున్నది. (విరహము నభినయించి) అయ్యో! (చేతి గడియారమును చూచి) వేళ మించు చున్నదే. విశారదుఁడేలకో యింకను రాఁడాయెను. హేమను బంపుదునా?

హేమా! (అంతలోనే యోజించి పాటపాటు నభినయించును.)

హేమ—(లోపల నుండి) అమ్మా! వచ్చితి.

ప్రేమ—ఏమియు రా నక్కఱ లేదు. నీ కార్యముల సావకాశముగఁ జేసికొను చుండుము. (స్వగతమున) ఏమిది. నాకు బుద్ధి స్వాధీనమున లేనటు లున్నది. (మఱలఁ బ్రక్కకుఁ జూచి కూర్చుండి) రాలేదె. (చేతులఁ బిసికి కొనుచు) అయ్యో! రాఁడు కదా. వచ్చును. వచ్చిన తోడనే (ఉబ్బిన దేహముతో నిట్టూర్పు విడచి) యెదురేగి బిగ్గఁ గౌఁగిలింప (అర్థోక్తితో యోజించి) ఆ-ఆ-మనసా! తొందర పడకుము. ఔరా! నే జ్ఞానసూన్యనై

పోయితిని. ఈసాహసము చెల్లదు. (యోజించి) విశారదుని మనంబును గుర్తింపక తొందరపడ రాదు. విశారదునిపై నా కుండెడి మోహము నొకేసారి బయలు పఱుప రాదు. నా శక్తియంతయుఁ బ్రయోగించి (తల యూఁచుచు) విశారదుని లోఁబఱచు కొనినఁ గదా ప్రేమ కుమారి జన్మము సార్థకమగును. సమయము ననుసరించి చతురోపాయములఁ బ్రయోగించి సాధింతుఁ గాక. (అని తమకమున బల్లపై నుండు చిత్ర ఫలకమును గైకొని) ఔరా! యీ సౌందర్యము (అని ముద్దిడి) విశారదా!

సీ.—నీ చిత్ర పటమును ♦ నేఁ జేతఁ గొను నాఁడె
యతి ప్రేమతో నిడి ♦ నట్టి ముద్దు
నిను మోహపు జూపు ♦ నేఁ గాంచి మోహించి
లాలింప నిడిన వ ♦ రాల ముద్దు
పతివీవె నా కని ♦ పలు విధంబుల నిన్ను
నమ్మి పెట్టిన రత ♦ నాల ముద్దు
నా మనోహరునివై ♦ నీ మనోహరినిగాఁ
జాఁట నేఁ గొన్న వ ♦ జ్రాల ముద్దు

తే. గీ. కోరి స్వప్నము లో నిడు ♦ కొన్న ముద్దు
మేలుకొని యాత్మలో నిడు ♦ మేటి ముద్దు
నెన్నియో చెప్ప లెక్కలే ♦ నన్ని ముద్దు
లన, విశారద! రారమ్ము ♦ లలిత రీతి.— ౧౬

(అని మఱల ముద్దిడుకొను చుండ)

ప్రవేశము :—విశారదుఁడు.

విశా—(ప్రవేశించుచు) వచ్చితి. వచ్చితి. అమ్మా! ఆలస్యమునకు క్షమింప వేఁడెద.

ప్రేమ—(విశారదుని పలుకుల విని తొందర నభినయించుచు పటమును ముందటి బల్లపై నిడి) విశారదా! నీవు వచ్చి యెంతసేపైనది. (అని రత్నకంబళమును గైకొని క్రిందఁ బఱచుటకుఁ బ్రయత్నించుచుఁ జిఱునవ్వు నభినయించి క్రేఁగంటఁ జూచుచుండ)

విశా—ఇప్పుడే—మీరు విశారదా! రా రమ్మని ననుఁ జూచి పిలచితిరే. ఇప్పుడె. ఇంతకు మునుపె.

ప్రేమ—(కంబళిని బఱచుచు స్వగతమున) పాపము. నేఁ బిలచితి ననియే భావించినాఁడు. (తల యూఁచుచు) కానిమ్ము. అప్పుడె యే మాయెను. (కంబళిని బఱచి ప్రకాశముగ) కూర్చుండుము విశారదా! (అని వీణ గైకొని తాను కంబళిపైఁ గూర్చుండును.)

విశా—(కంబళిపైఁ బ్రేమకుమారికి నెదురుగఁ గూర్చుండి) అమ్మా! వీణీయను ముందిడుకొని నమస్కరించి తొలుత శారదాదేవినిఁ బ్రార్థింప వలెను. ప్రార్థన పద్యమును నేఁ జెప్పెద. మీరుఁ బలుకు చుండుఁడు. రేపటి నుండి దానిని మీరు నేర్చుకొని చెప్పవచ్చును.

ప్రేమ—(యోజన నభినయించు చుండి) విశారదుని ప్రార్థనయూ కానిమ్ము. (చిఱునగవు నభినయించును)

విశా—విశారదునిది కాదమ్మా! శారదా ప్రార్థనము.

ప్రేమ—(పొఱపాటు పడుట నభినయించి) ఓహో! శారదా ప్రార్థనమా మంచిది. కాని త్తము.

విశా—పలుకు చుండుఁడు (అని)

శా.—"తల్లీ! శారద!" (నిలుపును)

ప్రేమ—(వేఱొక ప్రక్కఁ జూచుట నభినయించి) "తల్లి విశారదా!" (అని నిలుపును)

విశా—(ఆశ్చర్యమున నోరు మూసికొను నట్లభినయించి) కాదమ్మా! నేను" తల్లీ శారద" అని యన మీరు "తల్లి విశారదా!" యందురు. ఈ దినము మంచిది కానట్టు లున్నది. మీకు మనస్సు స్థిమితముగ లేనట్లున్నది. రేపు ప్రారంభింతము.

ప్రేమ— (ఆశ్చర్యమున) ఏమి విశారదా! నే నేమంటిని. "తల్లివి శారదా!" యంటిని. తప్పేమి. నేను "తల్లి విశారదా" యంటినా (నవ్వుచు) నీ వట్లర్థముఁ జేసి కొంటివి కాఁబోలు. ఊఁ- (నిర్లక్ష్య భావముతో) ఎట్లయిన నేమి మునిఁగి పోవు నది లేమ్మ. ఊఁ-కానిమ్ము. (అని చేతితో మోకాలిపైఁ దాఁకును)

విశా—(ఆమె తాఁకినతోడనే యులికి పడి) ఔరా! (యోజించి) నే నే పొఱపాటున నట్లను కొంటిని కాఁబోలు. (మఱల యోజించి) నేను "తల్లీ! శారద!" యంటిని గదా. ఆమె "వి" యను యక్షరమును సృష్టించి పలుక నేల. ఆమె పొఱపాటున నట్లు విని యుండును. పాపము—కానిమ్ము. (అని యోజించు చుండ)

ప్రేమ—(చిఱునగవున) ఊఁ-కానిమ్ము విశారదా! యోజింతు వేల. విశారదా ప్రార్థనము కాని (అర్ధోక్తి)

విశా—(విసుగుతో) అబ్బా! "విశారదా ప్రార్థనము" కాదమ్మా.

ప్రేమ—(నవ్వుచు) ఆ—ఆ—ఏమీ. "విశారదాప్రార్థనము" కానిమ్మంటినా నేను. "విశారదా!" ప్రార్థనము కానిమ్మంటిని.

విశా—(స్వగతము) ఔరా! ఈమె నేర్పరితనము. నా మాట బొత్తిగ సాగుట లేదు కదా. (తలయూఁచి) ఔను. ఇది నా పొఱపాటే. (ప్రకాశముగ) అమ్మా! పలుకుఁడు. మీరు ముందు బాగుగ గమనించి తదుపరి పలుక వలయును.

శా.—తల్లీ! శారద! నేను వీణియను చే
తఁ బూనెదఁ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా
నుక్తుల్ సుశబ్దంబు తో
భిల్లఁ బల్కఁగ. జేసి వీణియను సం
ప్రీతిఁ గడుఁ నేర్పుమై
నుల్లాసంబు జనించు భంగి నను నే
ర్పొప్పింపఁ జేయంగదే.— ౧౭

ప్రేమ—(విశారదుఁడు పై పద్యమును జెప్పు చుండఁ బాగుగ గమ నించినటుల నటించి పలుకుచు ముగిసిన వెనుక వీణియకు నమ స్కరించి క్రింద నుండిన దానినిఁ దీసికొని ప్రకాశముగా) విశా రదా! నేమి చేయ మనెదవు. (అని క్రేఁగంటఁ జూచి చిఱు నవ్వు నవ్వును.)

విశా—అమ్మా! మీరుఁ గొంత వఱకు వీణాభ్యసన మొనరించి యుంటిరి గదా. మీరుఁ దెలిసిన వఱకు వాయింపుఁడు. ఆవల నేఁ జెప్పెద.

ప్రేమ—సరి. (అని వీణియను సవరించి కొంతసేపు వాయించుట నభి నయించి) విశారదా! ఈ తంతి శబ్ద మపస్వరముగఁ బల్కు- చుని (కుడిచేతఁ జూపుచు) ఆ సరకట్టును సవరింపుము.

విశా—(సమీపమునకు వచ్చి) ఈ తంతియా. (అని యొక దానిని తాఁకును.)

ప్రేమ—అదికాదు (క్రేఁగంటఁ జూచును)

విశా—ఇదియా (అని వేఱొక దానిని దాఁకును)

ప్రేమ—(ముఖము చిట్లించి నవ్వుచు) అబ్బా. అదికా దిది (అని తటా లునఁ గరమును బట్టి యొక మెట్టును జూపఁ బ్రయత్నింప)

విశా—(ఆమె చేతినుండి తన కరమును వెంటనే లాగుట నభినయించి) ఆమ్మా! (అని యబ్బుర పడునంతలో)

ప్రేమ—(విరహ యుత సంతోషమున) అమ్మా.— (అని తన చేతిని విడిలించు కొనుట నభినయించి నే నిదియుం దెలియని భంగి వీణె మీటుచుండి నిస్పృహతో) ఊ- (అని తీసి ప్రక్కనం బెట్టి) విశారదా! పోనిమ్ము-ఒక మాట-ఊ-నీవు మఱి-ఈ-నన్నుం గాని-ఊ-నా వంటి చిత్తరువును గాని-చూడలేదా?

విశా—(తలం ద్రిప్పుచు) లేదు.

ప్రేమ—(ఆశ్చర్యమున) ఆ-నిక్కమే.

విశా—ఔను. విశేషమేమి?

ప్రేమ—(నవ్వుచు) నాకు—నిన్నెన్నిసారులోం జూచి నటుల జ్ఞాపకము అయిన విశారదా! నీవు-ననుం జూడనే లేదా?

విశా—లేదమ్మా!

ప్రేమ—ఆ-నా పటమున్నైన ఆ పటమును గూడం జూడ లేదా— చూడనే లేదా (నవ్వుచు) ఆ—ఆ—(అని తలం ద్రిప్పుచు) చూచి యుందువు లెమ్ము. (చిఱునవ్వున) చెప్ప వంతయే. దొంగ—(అర్థోక్తి)

విశా—నే నిక్కముగం జూడలేదు. (వీణెను చూపి) వీణెను గైకొని వాయింపుడు. ఆ మాట లేల.

ప్రేమ—(వీణెను త్రోయుట నభినయించి) ఊ—వాయింప వచ్చును లెమ్ము. ఏమి తొందర. నీ వీణ—యెవరికిం గావలయును. (నిస్పృహచేం జప్పరించును)

విశా—నన్నేల రమ్మంటిరి. మఱేమి కావలయును.

ప్రేమ—ముందటి సంగతి యటుండ నిమ్ము వెనుకం జూతము. ఇపుడు-ఇప్పుడె కావలసిన దాని నిత్తువా?

విశా—నా యొద్ద నుండిన కదా. అదియుఁ గాక నేను మిక్కిలి బీద వాఁడను. మీకుఁ దెలియదు కాఁబోలు.

ప్రేమ—అవేవియుఁ గావు. నీ యొద్ద నుండునదే. నీ వియ్య నెంచిన నొక నిమిషమే.

విశా—ఈయఁ దగినదా ?

ప్రేమ—నా కీయఁ దగినదే.

విశా—అటులైన నిత్తును.

ప్రేమ—నిజమే.

విశా—అన్నృత మాడుదునా.

ప్రేమ—(ఆతురతతో) సత్యమే-ఆ—ఏదీ—చేతిలోఁ జేయి వేయుము.

విశా—(చేతిలోఁ జేయి వైచి) ఇది సత్యము.

ప్రేమ—(సంతోషముతోఁ గూడిన క్రేఁగంటి చూపులతో) అడుగనా ?

విశా—అనుమాన మేల?

ప్రేమ—(అనుమానముచేఁ జీర కొనను వ్రేలికిఁ జుట్టు కొనుట నభినయించి క్రేఁగంటఁ జూచి) ఆ—అడిగిన—ఆ—నీ—వేమను కొందువో యని (అర్థోక్తి)

విశా—ఏ మనుకొందును. మంచి దందును.

ప్రేమ—నిక్కమా ? విశారదా! అడుగుదునా. ఇత్తువా ?

విశా—(విసుఁగుచే) అబ్బా ! ఎన్ని సారులు చెప్పవలయును. అదేమొ బయటికి రా నిమ్ము.

ప్రేమ—(క్రిందఁ జూచి) ఏమియు లే (అర్థోక్తి)

విశా—ఏమియు లేకున్నఁ బో నిమ్ము.

ప్రేమ—ఆ - ఆ - (తలఁద్రిప్పి) అమ్మా—ఎందుకు లేదు. ఊ— మఱి అడుగుదునా ?

విశా—అబ్బా! ఏమో పోవమ్మా. ఎన్ని సారులు.

ప్రేమ—(మెల్లఁగ) అయిన—ఆ—నీ—కు (అనుమానించి)నీ—ముద్దొకటి కావలయు (అని యొయ్యారముగఁ బ్రక్కకుఁ దిరిగి చిఱునవ్వు నభినయించును.)

విశా—(విస్మయమున) ఆ—ఆ—(చెవులు మూసికొని) హా రా! పాపము శమించుఁ గాత.

ప్రేమ—ఏమి విశారదా! ఇచ్చెదనని యీయవా ? మాటఁ దప్పుట ధర్మమా.

విశా—దేవీ! నీ వేమి పలుకు చుంటివో యోచించితివా లేదా ?

ప్రేమ—తెలిసి యోచించియే యడిగితిని. అడుగ వలసినదే యడిగితిని ఏమందువు ?

విశా—(వేఱొక ప్రక్కఁ జూచుచు) ఇది యడుగ వలసినది కాదందును. నే నీయ తగినదియుఁ గాదు గనుక నీయ నందును. క్షమింపు మందును. నమస్కరింతును. (అని నమస్కరించును.)

ప్రేమ—నిన్నెన్ని సారులో ముద్దాడి యుండ నేఁ డొక—ఒక్క ముద్దియఁ జాలవా ?

విశా—(నవ్వుచు) పిచ్చి తల్లీ! ఇది కల్ల. ఎవరైన నమ్ముదురా. నవ్వుదురు. నేను నిన్ను చూడనే లేదు కదా. అట్లు సాధ్యము.

ప్రేమ—(చిఱునవ్వుచేఁ దలఁ ద్రిప్పి) ఆ - ఆ - నీ వెల్లప్పుడును నా హృదయ కమలమును హత్తుకొని యుండు వాఁడవు చూడనే లేదనెదవు.

విశా—(ఆశ్చర్యమున) ఇదేటి న్యాయము. నేను శాంతినికేతనము నుండి నిన్నఁ గదా వచ్చితిని.

ప్రేమ—ఓహో మఱచితిని. నీవు కావు. నీ చిత్ర ఫలకము. నే నద్దానిని దనివి దీఱ—మాటి మాటికి స్వప్నమున సహితము—వేవేల దానిని నే ముద్దాడని నిముసమే లేదు. (మఱచుట నభినయించి) ఔరా! నీతో మాటాడుచు మఱచితిని (అని పటమును గైకొని ముద్దిడు కొనును.)

విశా—(నివారింపఁ బ్రయత్నించి) ఆ – ఆ – సాహసము. తగని పని. ఈ చిత్తరువును నీ కే పాపి యొసఁగెను. (అని దానిని లాగఁ బ్రయత్నించుట నభినయించును.)

ప్రేమ—(పటమును నెడమ చేత వెనుక నిడుకొని కుడిచేత విశారదుని వారించుట నభినయించి) విశారదా! నన్ను నీకు వివాహముఁ జేయఁ గోరి దానినిఁ జూచి యిష్టమైనచోఁ బ్రేమింప నా కొసంగిరి. విశారదా! అద్దానిని జూచిన మఱు క్షణమే—అప్పుడే—ఆ వెంటనె నిష్కళంక హృదయమునఁ దాల్చి ప్రాణ పతిగ భావించి ముద్దిడి మూఁడు వేళలఁ బూజించుచుంటిని. ఆ దినమే నీవు నా భర్త వని యనుకొంటిని.

విశా—(చెవులు మూసి కొని) హర హరా! అమ్మా! ఆ మాట లిఁక మానుము. వివాహ ప్రయత్నముఁ జేసి యుండ వచ్చును. నాకుఁ బెండ్లి యక్కఱ లేదని వెల్లి యుంటిని గదా. ఆ మీఁదఁ బెద్ద తండ్రి గారిని పరిణయ మాడితివి. కనుక నాకుఁ దల్లివి కావలయు.

ప్రేమ—అయిన నా కోర్కెఁ దీర్చవా?

విశా—(యోజించుచుఁ బలుక కుండును)

ప్రేమ—

చ.—చెలువుఁడ నేను, నీ సొగసుఁ
జిత్తరు వంచునఁ గాంచి కన్నులన్
జల జల బాష్పముల్ విడిచి
జల్లుమనంగ భ్రమించి యంతలోఁ
దలఁచితి నిన్నుఁ దప్ప నిఁకఁ
దాఁకను నన్యు నటంచు నక్కటా!
పలుకవ దేమొకో హృదయ
భావ మెఱుంగఁగ లేవొ తెల్పవా.— ౧౮

విశా—తల్లీ! కర్ణ కఠోరములగు నీ పలుకుల నే వినఁ జాల. ఇఁక నా హృదయమును నొప్పింపక వీణియను జేకొని వాయింపుము.

ప్రేమ—(స్వగతమున) పాప మెకింత విరామ మొసంగెద గాక (అని వీణెఁ దీసికొని వాయించుట నభినయించి ప్రకాశముగ) ఆ—అయిన విశారదా! శాంతినికేతనమున విద్యాభ్యసనము కడు మనోహరముగ నుండు నందురు. నిజమా?

విశా—చెప్ప వలయునా.

ప్రేమ—అక్కడ స్త్రీలకుఁ గూడఁ బ్రవేశ మొసంగెద రఁట సత్యమా?

విశా—అవును.

ప్రేమ—(మెల్లఁగ) మదదృష్టము.

విశా—అదేమి తల్లీ!

ప్రేమ—అక్కడికేగి నీతోఁ గూడ వీణావాద్యమును నేర్చుకొను నదృష్టము లేక పోయెనే యని చింతించెద. అదికాదు విశారదా! నీ వేగు నపుడు మా యూరికి సందేశ మంపి యుండ రాదా? పోనిమ్ము—అక్కడ స్త్రీలకుఁ బ్రత్యేక వసతి గృహములును, పాఠశాలలును మొదలగునవి కలవా?

విశా—ఆ నియమ మేమియు లేదు. స్త్రీ పురుషు లందఱు సోదరీ సోదర భావమున మెలంగుచుఁ గళల నభ్యసింతురు.

ప్రేమ—అయిన (వీణను ప్రక్కనఁ బెట్టి) ఒకరి నొకరు ప్రేమింతురా? లేక యెవరి గతి వారిదా?

విశా—ఒకరి నొకరు మిక్కిలిగఁ బ్రేమింతురు.

ప్రేమ—నీవు—ఊఁ—ఎవరినైనఁ బ్రేమించితివా?

విశా—ఒకరినా అంద (అర్ధోక్తి)

ప్రేమ—అక్కడ స్త్రీలు మిక్కిలి యందముగ నుందు రేమో. (చిఱునవ్వు నవ్వుచు) నా కంటె శృంగారముగ నుందురు కాఁబోలు. నా యంద మొక యందములోఁ జేరిన (అర్ధోక్తి)

విశా—అదే మన్నా! నీ కంటె యందగత్తెలా. పలు విధముల నుందురు.

ప్రేమ—అయిన నీ కందఱొకటియే, సర్వులను సమముగఁ బ్రేమింతువు కాఁబోలు.

విశా—అవును. నా కందఱొకటియే.

ప్రేమ—మరి. అందఱిని ప్రేమించు నీవు నన్నేలఁ బ్రేమింపవు?

విశా—ఎందులకు లేదు. వారివలెనె నిన్నుఁ గూడఁ బ్రేమింతును.

ప్రేమ—(స్వగతమున) త్రోవకు వచ్చునటు లున్నది. (తల యూఁచి) రాకున్న నీ ప్రేమకుమారి వదలునా? (ప్రకాశముగ) నన్నుఁ బ్రేమించు చుంటివా?

విశా—ఆహా. ముమ్మాటికి.

ప్రేమ—ఆ—అయిన—నన్నుఁ బ్రేమించి నే నడిగిన నా ముద్దొసఁగ వేల.

విశా—(నోరు మూసికొనుట నభినయించి) ఆ—ఆ—మరల మొదటికి వచ్చితిరే.

ప్రేమ—విశారదా! ఏమీ! నేను మొదటికి వచ్చితినా? నీవే ననుఁ ప్రేమించితి నని యన లేదా?

విశా—ఆ ప్రేమయా. కాదు. కాదు.

ప్రేమ—మఱి యే ప్రేమ.

విశా—ఏ ప్రేమయా. తల్లిపైఁ దనయున కుండెడి ప్రేమ. సోదరిపై సహోదరున కుండు ననురాగము. అంతియ నే (అర్ధోక్తి)

ప్రేమ—(తాను అందుకొని) అంతియ నే—ఊ—అనుము ప్రేయసిపైఁ ప్రియున కుండు ప్రే (అర్ధోక్తి)

విశా—(వెంటనే) ఆ-ఆ-కాదు. కాదు.

ప్రేమ—(నిరుత్సాహమున) అయ్యో. వృథయయ్యెనే (యోచించి స్వగతమున) ఏమి చేయుదును. నా ప్రయత్నములకుఁ జోటొసంగదే. ఇంక నా మోపాయము పనికిరాదు. కానిమ్ము. (తల యూఁచుచు) రెండవ యుపాయమునఁ బ్రయత్నించెద. (యోజించు చుండును)

విశా—(వీణ నొసంగుట నభినయించి) కానిండు.

ప్రేమ—(యోజించుచు అందుకొని) విశారదా! బాగుగ యోచించు కొనుము. నా మాట వినిన నిన్ను సంతోష సాగరమున నోలలాడింతును. నీకే కొఱంతయు లేకుండ నా సర్వస్వమును నీ యధీనము గావింతును. వేయేల. నా ప్రాణ మడిగినను దృణప్రాయముగ నెంచి నీ మృదు పదంబుల కడ నిడెద.

విశా—అమ్మా! నా కొక్కటియుఁ బని లేదు.

ప్రేమ—అబ్బా. (చేతులఁ బిసికి కొనుచు) ఇంకేల్లు. అయ్యో. విశారదా! ఇవి నీ దృఢ వాక్కులేనా?

విశా—నిస్సంశయముగ.

ప్రేమ—నిజమా

విశా—ముమ్మాటికిని నిజము.

ప్రేమ—నా మాట వినవా ?

విశా—వినను. వినను. వినను.

ప్రేమ—విశారదా! నీ విట్టి వజ్ర హృదయుఁడ వెట్లైతివి.

విశా—అమ్మా! ఔను. నాది నిక్కముగ వజ్ర హృదయమే. నన్నింక బాధింపకుము. ప్రథమ సమావేశముననే మీరిట్టి సాహస కార్యమునకుఁ బూనఁ దలఁచినచో నిఁక మీఁద మీ వీణా పాఠమునకే స్వస్తిఁ జెప్ప వలసి వచ్చునేమో.

ప్రేమ—(తనలో) అక్కటా! నా రెండవ యుపాయము వృథ యయ్యె. ఇఁక మాటాడిన నితఁడు నా భవనమునకు రా మానునటు లున్నది. నేఁడింతటితోఁ జాలించి యేవో మా టలఁ గొన్నిటిఁ జెప్పి తేపు మరల వచ్చునట్లుఁ జేయ వలయు. నా భవనమునకు వచ్చు చుండినచోఁ దక్కిన రెండుపాయ ములఁ బ్రయోగించి నా వలలోఁ బడ వేసి కొందుఁ గాక. (ప్రకాశముగ) విశారదా! (నవ్వుచు) వేఱొక విధమున భావింప వలదు సుమా.

తే. గీ. వయసు వాఁడవు తగినంత ♦ బలము కలదు
అందమా యన్న వర్ణింప ♦ నలవి కాదు
ఔర! శాంతి నికేతన ♦ మందు నిట్టి
నిలువఁ గలిగితివో లేదో ♦ తెలియఁ గోరి.

ఇటులఁ బల్కితి నంతియె. (చేతి గడియారమును చూచి) విశారదా! పాపము. ప్రొద్దైనది. చాల శ్రమ పడితివి. నేఁడు గృహమునకేగి తేపు నేఁటికంటె త్వరితముగ నా కళ ప్రారం భింప వలయును.

విశా—(లేచి) సరి. తమ యిష్టము. (అని పోవుచుండ)

ప్రేమ—విశారదా! వీలున్న సమయమునను వచ్చి పోవలయు. ఇదే చూచుము. (అని చేతులఁ దట్టి పిలిచి నవ్వు నభినయించును)

విశా—(తిరిగి చూచి నిష్క్రమించును)

ప్రేమ—(నిస్పృహచే సోఫాపైఁ గూలఁబడి వెళ్లెడి విశారదునిఁ జూచి)

ఉ.—ఏల సృజించె వీని, నను
నేల సృజించెనో స్రష్ట, వీనికీ
లాలిత రూప వైభవ క
ళాయుత యౌవన మేలఁ గూర్చె, నా
కేల నొసంగె బేలతన
మీగతి, నాకీఁక దారి యేది, నే
లీల హరింతు వీనిని బ
లీ! మదనా! యిది నీదు కృత్యమే.— ౨౦

(అని సోఫాపై వ్రాలఁగా యవనిక పడును)

---

## తృతీయాంకము.

స్థలము :—మోహనరావు మందిరము.

సమయము :—రాత్రి యెనిమిది గంటలు.

మోహనరావు తన గదిలోఁ గుర్చీపైఁ గూర్చుండి యుండును.

మోహ—(చేతి గడియారమును జూచి) ఎనిమిది గంటలు కా వచ్చినను; విశారదుఁడు రాకుండుటకు హేతు వేమి? నే నెంత వలదని వేఁడు కొన్నను ప్రేమ కుమారీదేవికి వీణా వాద్యము నేర్పుటకుఁ బూను కొనియెను. (యోజించి) ఔను పాపము,

జమీందారుగారి పలుకులను ద్రోసి పుచ్చినచో నతని యభివృద్ధికి భంగము వాటిల్లఁ గలదు. అట్లగుననీ సమ్మతించిన మీఁదు మిక్కిలిగ నితని ప్రాణములకే ముప్పు వాటిల్లునాయని నా యనుమానము. కానిమ్ము. అన్నిటి కా జగదీశ్వరుఁడుండ నే నేల యోజింప వలయు. (అని ప్రక్కకుఁ జూచి ప్రకాశముగ) విశారదా! రా రమ్ము. ఏమి నేఁడింత యాలస్య మొనరించితివి.

ప్రవేశము :—విశారదుఁడు.

విశా—(వికాస రహితమగు ముఖమున నిరుత్సాహముతో) ఏమో యి! ఇంకను నెనిమిది గంటలైనను గాలేదు. ప్రారంభ దిన మైనందునఁ ద్వరితముగ ముగించి వచ్చితిని. అంతలోనె యాలస్య మాయె నందువు.

మోహ—(విశారదుని వదన మారసి) విశారదా! నీ మోము కళాహీనమై యున్నది. నీవిట్లెన్నఁడును నిరుత్సాహమున నుండెడు వాఁడవు కావే. నేఁడేమైన దేహ తత్త్వము వికటించినదా?

విశా—(యోజనలో నుండి) కాదు—ఔను. నేఁటి (అర్ధోక్తి)

మోహ—కాదు—ఔను-ఏమా పలుకులు.

విశా—సాయంకాలము నుండియు నాకేమొ సంకటము వేయుచున్నది. భోజనము చేయుటకే నాకిష్టము లేకున్నను రాకున్న నీవు నా కొఱకు వేచి యుందువనియు, చెప్పి పోవుద మనియు వచ్చితిని.

మోహ—(విశారదుని స్పృశించి) ఆ గుణము లేమియుఁ గనంబడ లేదే. ఏమో యున్నది. నేఁడు పీఠా పాఠము నెమ్మదిగ ముగిసినది కదా.

విశా—(యోజించుచు) ఆ— నెమ్మదిగనె—జరిగినది.

మోహ—(అనుమానించి తనలో) ఏమియో జరిగినది. నాతోఁ జెప్పకున్నాఁడు. కాని (తలయూఁచి ప్రకాశముగ) మిత్రమా! ఏపటి నుండి నీ వక్కడకుఁ బోవ నక్కఱ లేదు. నాకను మానముగను భయముగను నున్నది.

విశా—(లేని నవ్వు నభినయించి) పిచ్చివాఁడా! భయమేల? అను మానమునకుఁ గారణ మే మున్నది.

మోహ—నీ నిర్మలాననమునఁ గొడచూపు నీ చిహ్నములే నా యను మానమునకుఁ గారణము. లేకున్న

క.—నేరవు విశారదా! శృం
గారములకు నెలవు గాఁగ ♦ కన నీ నగు ముఖం
బిగిత్రిఁ గళలఁ గాసి వి
కారముగా నుండ నేల ♦ కమలిన భంగిన్. ౨౧

విశా—మిత్రమా! నీవు నా విషయమై అనుమానపడ నక్కఱ లేదు. అక్కడ సంశయింపఁ దగిన విషయ మేమియు నాకగుపడ లేదు. నామాట నమ్ముము.

మోహ—నీ వక్కడ కేగునపుడే జరుగఁబోవు సంగతులను గుఱించి చెప్పితిని. నాకు బాగుగఁ దెలియును. నేను రహస్యముగ విచారించుచుంటిని. ఆమె హృదయము నీయందు లగ్నమై యున్నటుల నే విని యున్నాను. ఆమె నిన్నుఁ దప్పక బలవంతమున నైనఁ జైకొనకఁ దప్పదు. అందులకు నీ వంగీకరింపవని నాకు దృఢ నమ్మకము. నీ వంగీకరింపకున్నచో; భువనమోహినిగ నెంచి సతతము తన దయకుఁ బాత్రుఁడై యుండిన జమీందారును ప్రేమ కుమారి కపట వేషమునఁ గల్ల మోహమును గనంబఱచి నీపై వట్టి నిందలఁ గల్పించి నిన్నుఁ జంపింపక మానదని నా యూహ.

విశా—(స్వగతము) ఆమె చర్యలఁ దిలకింప నీతని పలుకులకు సరిపోవు చున్నయవి. కడపట నా శీలమును బరీక్షింప నిట్లంటి నని కదా యనెను. అంతటి నీచ కృత్యమునకుఁ బూనుకొనునా కాదు. (తలయూఁచుచు) అట్టు లెన్నటికిని కాదు. (ప్రకాశముగ) మోహనా! (నవ్వుచు) నను జంపించు నను భయమా? ఆమె యట్టి సాహస కృత్యమునకుఁ బూనదని నమ్ముము. పూనినను విశారదుఁడు లొంగఁడని నీ వెఱుంగుదువు. సమ్మతింపనిచోఁ జంపించు నందువా? ఆ ప్రాప్తి యున్నఁ దప్పించుకొనఁ గలనా?

మోహ—సర్వకాల సర్వావస్థల యందును భార్యలఁ గనిపెట్టుకొని యుండి, వారు కాలఁ జూపిన కార్యముల శిరమునఁ జేయఁ గంకణము ధరించి యుండు వారికి సత్యాసత్యముల గ్రహించు నట్టి తెలివి యుండునా. "ఎద్దీనిన దన గాటఁ గట్టు" మన్నట్లు భార్యల పలుకుల మీఱఁ జాలక యెట్టి కార్యముల నైనఁ జేయుదురన నిఁక జమీందారు గారి విషయము నే నన నక్కఱ లేదు.

విశా—నా తండ్రి మీరు తండ్రిగో. నా విషయము చిన్ననాఁటి నుండియుఁ గనుచుండు వాఁడు నన్ను సంశయించి బూటకపు మాటల నమ్మఁ గలఁడా?

సీ.—తరుణిపైఁ దన కెంత ♦ తగని మోహంబున్న
నిసుమంత నా బుద్ధి ♦ యెఱుఁగఁ డొకో
చాడీలఁ గల్పించి ♦ చంపించు ననుటకు
సత్యంబు గ్రహియింపఁ ♦ జాలఁ డొకో
తగని పల్కుల నాడి ♦ ధాత్రిని మెప్పింప
వీలుగా దనుట నీ ♦ వెఱుఁగ వొకో
పసిగొడ్డ మొదలుగాఁ ♦ బౌరులతో నెల్లఁ
బండితుల్ నా ప్రక్కఁ ♦ బలుక రొకో

తే. గీ. న్యాయమూర్తులు లేరొ యన్యాయములను
జెందెడి, న్యాయంబు నిల్పఁగఁ జేయ రొక్కొ
అంత యన్యాయమును జేయ నఖిల జగముఁ
బాలనముఁ జేయు వాఁడుఁగా పాడి యొక్కొ. — ౨౭

మిత్రమా! మన మూరక లేనిపోని యూహలకుఁ లోనై ఆమెకు వీణా పాఠము నేర్పుటకుఁ బోసిచో నా తండ్రి వలన నాకు ముప్పు తప్పదు. ఆయన యాజ్ఞను మీఱఁ జాలను. ఇక్కార్యమున నా యసువులుఁ బోనున్నను నే వెను దీయను. నా తండ్రిచే వీణ నేర్పుటఁ జాలింపుమను వఱకు నేఁ బోక మానను. ఇది నా దృఢ సంకల్పము.

మోహ — (తనలో) ఇతని బుద్ధిని మాన్ప నా చేతఁ గాదు. విధి యెట్టుల జరుపునో జరుప నిమ్ము. (యోజించి) విశారదా! (అని రెండు కాగితములఁ దీసి) ఈ కాగితముల మీఁద నీ సంతకమును జేయుము. నాకుఁ బని యున్నది.

విశా — కాదందునా (అని యొక చోట సంతకముఁ జేయును.)

మోహ — అచ్చట కాదోయి. ఇంకఁ గొంచము క్రిందఁ జేయ వలయును. రెండంగుళముల స్థలము విడచి చేయుము చాలును.

విశా — (సంతకముఁ జేసి) చాలునా?

మోహ చాలును. (అని కాగితమును దీసికొని చేతి గడియారమును చూచి) భోజనమునకు వేళయైనది పోవుదము లెమ్ము.

(అని నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము.

---

# ప్రేమకుమారి.



## తృతీయాంకము.

### ప్రథమరంగము.

స్థలము:—ఆరామ మందిరము నందలి గది.

సమయము:—ఉదయ మెనిమిది గంటలు.

ప్రేమకుమారి తన గదిలో బల్ల కెదురుగ నుండు కుర్చీ మీఁదఁ గూర్చుండి యుండును. బల్లపై వ్రాఁత పరికరములు, క్రొవ్వు వత్తి నిప్పుపెట్టె సీలుచేయు వస్తువులు మొదలగునవి యుండును.—

ప్రేమ—

మ.—"కలలోఁ జూతు నటన్న నిద్ర యెఱుఁగన్
గన్నారఁ జిత్తర్వునన్
దెలియం జూచెద నన్న బాష్పములచే
నేత్రాబ్జముల్ క్రమ్మెడిన్
గలయన్ ధ్యాన మొనర్పఁ బూన మది ను
న్మాదంబు సంధిల్లు నీ
యిలలోఁ దాళఁగరాని తాప మహహా
యెట్లోర్చెదం దైవమా!"— 93

(సముఖము వేంకట కృష్ణప్పనాయక మహాకవి)

(స్వగతము) అకటా! నే నెన్ని దినములని యీ మదనాగ్ని బాధ సహింపఁ గలను. ఇంత కాలము విశారదుఁడు నా కన్నులకుఁ గానఁ బడ కుండి నందునఁ గొంత వఱకు దాళఁ గలిగితిని. ఇప్పుడు

నే నా సుందరాంగుని దర్శించుటయే కాక మీఁదు మిక్కిలి ప్రక్కనఁ గూర్చుండియు వినోదముగ మాటాడిన నా గాన విశారదునిఁ గవయఁ జాలక పోతినే. అయ్యో—(నిట్టూర్పు విడచి) యీ పంచ బాణుని—మోహనాంగుల మృత్యుదేవత కల్పించు నీ యీ సుగాన శరుని వాఁడి తూపుల బాధ నే నెట్లు సహింపఁ గలను. విశారదుఁడు నా ప్రోల నుండినచోఁ గొంత వఱకీ బాధ శమింపఁ గలను. (ఉస్సురు మని నిట్టూర్పు విడిచి యోచించి తల యూఁచి) నిన్నటి సంజకడ విశారదుఁడు తన మందిరమున కేగు నపుడు ఉదయమున రమ్మంటిని గదా. అయ్యో! ఇంకను రాకున్నాఁడే. మరచెను కాఁబోలు. (గడియారమును చూచి) తొమ్మిది గంటలు కావచ్చినను రానివాఁ డింకెపుడు వచ్చును? ఇక్కడికి వచ్చినచో భోజనమునకు నిలిపి బ్రతిమాలి యెటు లైనను నా వలలో వేసికొన నెంచి యుంటిని గదా. అదియుఁ గాక జమీందారుగారు పది గంటల నుండి యెచటికో అత్యవసర కార్య నిర్వాహణమున కేగుదు రనియు, విందునుండి చాల ప్రొద్దు వఱకు రారనియు వార్త వచ్చినది. అయ్యో! మంచి సమయము లభించి నపుడు విశారదుఁడు రాక పోయెఁ గదా. ఊ—(తలఁ గొట్టి కొనుచు) ఇది నా దురదృష్టము. (గడియారమును చూచి) అప్పుడె తొమ్మిది గంటలు దాఁటినది. (విసుగుచే) ఈ పాడు గడియారము బాగుగనే దాపురించినది. ఇంత తొందఱగ నడువ వలయునా. విశారదుఁడు రాక మునుపే తొమ్మిది గంటలా? అయ్యో! యేమి చేయ వలయును. (యోజించి) అవును. (అని కుర్చీ బల్ల కడ కేగి కూర్చుండి కాగితము పౌంటెన్ (Fountain) కలము దీసికొని వ్రాయుట నభినయించి చదివి యోజించి) ఛీ—ఇది బాగుగ లేదు. (అని కాగితమును జింపి వేసి మరియొక దానిపై వ్రాసి మరలఁ జదువుట నభినయించి) ఊ—హూఁ—ఇదియు బాగుగ లేదు. ఒకటే భావ మిచ్చును. అదియుఁ గాక యితరులుఁ జూచిన గుట్టు బయటఁ బడును. (యోజించి) ఊ-హు-(తలఁ ద్రిప్పి) ఇదియుఁ బనికిరాదు. ఇతరుల కొక యర్థమును విశారదుని కొక యర్థమును వచ్చునటుల వ్రాయు

వలయును. (అని దానిని చింపి వైచి మరల యోజించి యోజించి అక్షరముల లెక్కించుచు వ్రాసి ముగించుట నభినయించి) సెబాస్! ఇది బాగుగ నున్నయది. భద్రముగ లక్క-సీలు చేసి పంపెద. (అని క్రొవ్వవత్తిని వెలిగించి లక్క సీలు వేసి లకోటా మీఁద విలాసము వ్రాసి ప్రకాశముగా) హేమా!

ప్రవేశము :— హేమ.

హేమ—(వచ్చుచు) అమ్మా! (అర్ధోక్తి)

ప్రేమ—ఇటు రమ్ము. (ప్రక్కలఁ జూచి) హేమా! చూడుము. ఈ కమ్మను గొని—ఏమి—బహు జాగ్రత్తగ—తెలిసినదా (ప్రక్కలఁ జూచి) విశారదుఁడు—ఏమి—నిన్న వీణ నేర్పుటకు వచ్చి యుండెను. జ్ఞాపక మున్నది కదా. అతనికి రహస్యముగ—ఇతరులకుఁ దెలియరాదు సుమా—ఇచ్చి యితరుల కంటఁ బడకుండ రావలయును. (అని యిచ్చును.)

హేమ—(తీసికొని) మంచి దమ్మా! చిత్తము. (అర్ధోక్తి)

ప్రేమ—జాగ్రత. ఇతరులకుఁ దెలిసినచో (కన్నులతో బెదరించుచు) నీ తల నీ భుజములపై నుండదు. తెలిసినదా?

హేమ—జాగరూకతతోఁ జేసెదను.

ప్రేమ—హేమా! నీ యిష్టము.—(కొంత దూర మేగ నిచ్చి)—హేమా! ఇటు రమ్ము—ఇటు రమ్ము. అతఁడు తన గృహమున లేకున్న నితరుల నడుగక తిరిగి రమ్ము.

హేమ—మంచిది. (అని పోవుచుండ.)

ప్రేమ—(మరల యోజన నభినయించి) హేమా! రమ్ము. రమ్ము—ఒక మాట. అక్కడ లేకున్నచో మిత్రుఁడగు మోహనరావు గృహమున నుండును. అక్కడ కేగి మోహనునికిఁ దెలియకుండ నియ్య వలయును.

హేమ—మంచిదమ్మా. (అని పోవును)

ప్రేమ—(హేమ వెళ్లువఱకుఁ జూచి) ఇఁకఁ ద్వరలో నా విశారదుఁడు రాఁగలఁడు. అన్నియు నలంకరింపఁ బోయెద.

(అని నిష్క్రమించును)

యవనిక పడును.

---

## ద్వితీయ రంగకము.

స్థలము :—మోహనరావు భవనము.

సమయము :—ఉదయము తొమ్మిది గంటలు.

మోహనరావు విశారదుఁడు కూర్చుండి ఫలాహారముఁ జేయుచు మాటాడుచుందురు.

మోహ—విశారదా! నీ విపుడు ప్రేమ కుమారీ దేవి గారామ మందిరమునకుఁ బోనే వలయునా ?

విశా—అవును. తప్పినచో ఆమెకుఁ గోపము వచ్చి మా తండ్రిగారి తోఁ జెప్పిన మాట వచ్చును.

మోహ—నేఁడు జమీందారుగారు పది గంటల నుండి గృహమున నుండరు. నేను గూడ నక్కడికే వెళ్లెదను. నేఁడు క్లబ్బులో విందు జరుగును. అందులకే యొంటిపాటు లభించునని యామె నిన్నుదయమే రాఁ గోరినది. మిత్రమా! నేఁడు పోవలదు. కావలసినచో యథావిధిగ సాయంకాలము వెళ్లుము. రాత్రి భోజనమున కిచ్చటికే రావలయును సుమా.

విశా—మంచిది. ఇపుడేగిన నేమి ?

మోహ—వలదు. ఆమె యొంటరిగ నుండుటయే గాక జమీందారు గారు లేరని మఱింత మోహపరవశురాలై నీ కొఱకుఁ

గాంచికొని యుండును. ఆలస్య మైనదని హార్థిగూడఁ బంపి ననుఁ బంప వచ్చును. నా మాట విని నేఁ దేని యొక సాకుఁ జెప్పి మాని వేయుదును.

విశా—మోహనా! ఆమె యందు నీ కేల చెడ్డ యభిప్రాయము పడినది. అది చాల పొఱపాటు. ఆమె యుత్కృష్ట వంశ సంజాత. జమీందారు భార్య. వివేకవతి. మఱియు విద్యావంతు రాలు. అట్టి సాహసమునకుఁ బూనదు. అందునను నేఁ బుత్రుడ నగుదును కదా.

మోహ—అమాయకుఁడా!

తే. గీ. మోహ పరవశు లైయున్న ♦ ముదిత లకును
నొంటి పాటున యువకులు ♦ నింటి లోన
లభ్య మైనను విటువ ర ♦ లభ్యమనుచు
వావిఁ దలఁపరు వినుమన్న! ♦ వలదు వలదు. —౨౮

నిన్నుఁ దప్పించు కొంటివి. ఎందులకు విడచితినో కారణ మగ్రా హ్యము. నేఁ డామెకు మిక్కిలి యనుకూలముగ నున్నది. కనుక నీ దినము నా మాట వినుము.

విశా—నేను నీ మాటల నమ్మను. మాట కొఱకు నిమేష మాత్రము నమ్మెదను; కాని యిది వఱకు ప్రేమకుమారీదేవి గారి శీలము ననుమానింపఁ గల కార్యమును నీవు విని గాని కని గాని యుంటివా?

మోహ—లేదు. మున్నొటికిని లేదు. ఆమె కేవలము పతివ్రతా దీక్షఁ బూని యున్నది. నిక్కముఁ బతివ్రతా శిరోమణి యను టకు నే వెను దీయను.

విశా—అన్నా! (నవ్వుచు) నీకుఁ దలఁ జెడినటు లున్నది. మఱి నన్నేల పోరా డెదవు. ఇఁక నీవు సంశయింప నేల? అను మానము నకుఁ గారణమే లేదు కదా.

మోహ—కావలసినంత యున్నది-ప్రథమమున నీ చిత్తరువును ప్రేమకు మారికిఁ బంపుట యొకటి—నీ వామె మనోనిశ్చయము నెఱుంగక యే పరిణయము వలదని పాఱి పోవుట రెండు—పుత్రాభివృద్ధికై జమీందారు ముసలి తనమునఁ దన్ను ప్రేమింపని యామెను వివాహ మాడుట మూఁడు—నీ వీ గ్రామమునకు వచ్చుట నాలుగు—ఆమెకు వీణె నేర్పుటకు సమ్మతించుట యైదు—ఊ—ఎన్ని కారణములు కావలయును ?

విశా—చాలు, చాలు. నీ కన్నియుఁ గారణములే. నాకు నీ కారణము లొక్కటియు సహేతుకముగఁ గన్పట్టుట లేదు. మొదటి నుండియు నీవు వల దనుచునే యున్నావు. నాకుఁ దప్పని విధియై యున్నది. మిత్రమా! నొసట వ్రాసిన వ్రాఁతఁ దప్పింగుచుకొనఁ జాలము. ఇప్పటికే యాలస్య మైనది. నేను వెళ్లెదఁ (అని పోఁబోవును)

మోహ—(విశారదుని చేయిఁ బట్టి) మిత్రమా! నా మాట వినవా ? పోయెదవా ? భోజనము చేసి పొమ్ము.

విశా—మిత్రమా! ఆలస్య మైనది. రాత్రి కూడ మా యింటికిఁ బోలేదు. మొదటఁ బ్రేమ కుమారిదేవి గారి కడ కేగి తర్వాత భోజనమునకు మా గృహమున కేగెదను. మా తల్లి కాచుకొని యుండఁ గలదు.

మోహ—సరి. నేను గూడ విందున కేగి వచ్చెదను. నీవు మాత్రము రాత్రి నాతోఁ గూడ భోజనము చేయుటకు వచ్చి తీరవలయును.

విశా—మంచిది. (అని పోవును)

మోహ—(విశారదుని వంకఁ జూచుచు) ఇతఁడేమొ నిర్భయముగ వెళ్లు చున్నాఁడు. నాకేమొ మిక్కిలి భయమగు చున్నది. అయినను విశారదునకే బాధయు రాకుండఁ గాపాడఁ బ్రయత్నింప వలయు. రహస్యముగఁ బ్రేమకుమారి విషయముఁ దెలిసి కొన వలయు. (యోజించి) విందునకేగ వలయు ననుట మరచితిని. (అని గడియారమును చూచి పోఁబ్రయత్నించి లేచి పోవుచుండ)

ప్రవేశము:—హేమ

హేమ—(లోపలనుండి) అయ్యా! మోహనరావు గారూ! విశారదులవా రెచ్చట?

మోహ—(తిరిగి చూచి స్వగతమున) ఓహో! ప్రేమకుమారి దేవి నెచ్చెలి హేమ వచ్చినటు లున్నది. ఎన్నఁడు రాని హేమ వచ్చుటకు హేతువు ముఖ్యమైనదిగ నుండక తప్పదు. అన్నియుఁ దెలిసికొన వలెను. (ప్రకాశముగ) ఎవరచ్చట?

హేమ—అయ్యా! నేను—

మోహ—(చిఱు నవ్వుతో) అయ్యా! నేనన్న-పేరు లేదా? ఇటు రమ్ము.

హేమ—(వచ్చి) అయ్యా! (అర్ధోక్తి)

మోహ—(చిఱు నవ్వుతో) ఓహో! హేమా! ఎవ్వరో యను కొంటిని. ఏమి విశేషము.

హేమ—విశార (అర్ధోక్తి)

మోహ—నా కేమిః తెలియును. నేను విశారదునికిఁ గానలి యుండునా ?

హేమ—కాదు. వారి గృహమున కేగ నిన్నటి రాత్రినుండి రాశే దనియు, మీ యింట నుండు ననియు వారి తల్లి సెలవిచ్చి నది. ఆ కారణమున నడిగితిని.

మోహ—(యోజించి) సరి. ప్రేమకుమారి దేవి గారు పంపఁగ వచ్చితివా?

హేమ—(ఆలోచింపక వెంటనె) కాదు. కాదు.

మోహ—నీకే పని యున్నది కాఁబోలు.

హేమ—లేదు. లేదు.

మోహ—జమీందారుగారి కేమైన-(అర్ధోక్తి)

హేమ—కాదండీ !

మోహ—(వినిపించు కొనక యించుక కోపము నభినయించి) నాతోఁ బరిహాసమా. జాగ్రత్త. జమీందారు గారితోఁ జెప్పి నీ తల-(అర్ధోక్తి)

హేమ—లేదం-(అర్ధోక్తి)

మోహ—(గద్దించి) లేదండీ ! కాదండీ చాలును.

హేమ—ప్రేమ-కాదు. కాదు-విశార (అర్ధోక్తి)

మోహ—(స్వగతమున) ఏమో రహస్య మున్నది. (ప్రకాశముగ) నీ కేమి పిచ్చి పట్టినదా ? అదే మచ్చట.

హేమ—(పైటను దడివి చూచి సవరించి) జా—అ—ఏమియు లేదండీ! ఆయన యెచ్చటి కేగెనో చెప్పఁడు.

మోహ—(ముందునకు వచ్చి) హేమా! చెప్పెదను కాని; జాబం టివే. ఏది. ఇటు తెమ్ము.

హేమ—ఏమండీ! నేను జాబని యెప్పు డంటిని. (పైట సవరించి) నా యొద్ద జాబు లేదు.

మోహ—మరే మున్నది.

హేమ—ఏమియు లేదండీ! విశారద (అర్ధోక్తి)

మోహ—(చిఱు నవ్వుతో) విశారదుఁ డుండెనా. హేమా! జా బెవరిచ్చి పంపిరి. విశారదునకే నా?

హేమ—అవును. (అని పొరపాటు నభినయించి) కాదు. ఆయన సంగతిఁ జెప్పఁడు.

మోహ—జా బిటు తెమ్ము. (అని ముందునకు వచ్చును)

హేమ—అయ్యో! జా బెక్కడ నున్నది. (అని పైట సవరింప జాబు క్రిందపడును.)

మోహ—(క్రింద బడిన లేఖనుగొని) హేమా! ఇఁకఁ బోవచ్చును.

హేమ—(పలుకకయే వెళ్లుచు) అకటా! ఈ సంగతి ప్రేమ కుమారికిఁ దెలిసినఁ జంపునే. ఆమె కీ సంగతి దెలియనీయరాదు. (అని పోవును)

మోహ—(స్వగతమున) నే నెంచినటుల విశారదుఁ డాలస్యము చేసి నందునఁ బ్రేమ కుమారి కమ్మ వ్రాసి పంపినటు లున్నది. చదువుదునా. ఇతరులకు వ్రాసిన జాబును నేఁ జదువరాదు. (యోచించి) ఊ—నాకును విశారదునకును భేదమేమి. చదివెద గాక. (అని విప్పి చదువుట నభినయించి) ఏమిది. ఈలేఖ సాధారణ లేఖల వలెఁ గాక యేదో వింతగ వ్రాయఁబడి యున్నది. చదివి చూచెదఁ గాక (అని లోపలఁ జదువుట నభిన యించి ప్రకాశముగ)

అరామ భవనము,

ఆదివారము.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ్రీ | వి | శా | ర | దా! | ర | మ్ము. | నే | ను | నా | వి |
| శా | లా | భి | రా | మ | హ | ర్మ్య | ముం | దు | శా | ర |
| దా | దే | వి | న | వ | స్య | ముఁ | బూ | జిం | తు. | నీ |
| పై | ద | య. | దే | వీ | క్రీ | డ | లఁ | గ | న | న |
| మో | ఘ | మ | గు. | త | డ | వో | న | ర్ప | ని | హా |
| ము | ను | ప | ర | ము | ను | ల | భిం | ప | వు. | నా |
| ప | తి | బ | య | లు | దే | ఱి | విం | దు | కుఁ | బా |
| ల | మిం | చి | న | టు | ల | యి | పు | డే | గ | ను. |
| రా | వ | ల | యు | ను. | నే | ను | యొం | ట | రి | ని |
| ఎ | ట్లు | లుం | దు | ను. | వ | చ్చి | న | నీ | యె | డ |
| ల | నా | ప | తి | చా | ల | ద | యఁ | గ | ల్గి | మ |
| ర | ల | గౌ | ర | వ | యు | తుఁ | జే | సి | గు | ణ |
| మే | శా | ర | ణ | మ | ను | చుఁ | బొ | గ | డు | ను. |

ఆద్యంతముఁ జూచి మధ్యమ కార్య మొనర్పఁ గోరు,

ప్రేమ కుమారి.

ఏమిది ప్రేమ కుమారి శారదా పూజలఁ జేయుచున్నదా? అయిన విశారదుఁ డెందులకుఁ బోవలయు. ఇందేమో గోప్యమున్నది. (అని మరలఁ దనలోఁ జదువుట నభినయించి) ఈ లేఖ యంతయుఁ బదుమూఁడు పంక్తులలో నిమిడి యున్నది. (ఎంచుట నభినయించి) ఏమిది. ఆశ్చర్యముగ నున్నది. ప్రతి పంక్తికిని యెంచి వ్రాసినటులఁ బదునొకం డక్షరములే యున్నవి. కనుక నిందేమో రహస్య ముండియే తీరును. ఇందుకు సూత్రమేమియు లేకుండునా. (క్రిందఁ జూచి) "ఆద్యంతముఁ జూచి మధ్యమ కార్య మొనర్పఁ గోరు ప్రేమ కుమారి" ఆద్యంతము—(యోజించి) ఆద్యంతమన—ఇపుడు. అనఁగా నిప్పుడీ లేఖనుఁ జూచి యని యగును. మధ్యమ కార్య మననేమి. (యోజించి మరల

యెంచుట నభినయించి) మధ్యమ కార్యము—మధ్యాక్షరములఁ జూడఁ గోరి యుండునా ? చూచెద (అని చదివి) ఔరా ! మధ్యాక్షర ములఁ జదివిన "రహస్యక్రీడను దేలనే వలయును" ఔరా ! ఆమె చతురత. (యోజించి) ఇటులనె ఆద్యంతమునకు వేఱొక యర్థ ముం డునా ? (యోజించి) ఔను. ఆది—అంతము—కలిసి ఆద్యంతమగును. అనఁగా ఆది—అంత్య వర్ణములఁ జూడఁ గోరినదా ? చూచెద. (అని చదివి) ఆహా ! తెలిసెను. అటులఁ జదివిన "శ్రీ విశారదా ! నీ పైన మోహము నాపఁ జాలను. రాని యెడల మరణమేను." ఔరా ! మాయోపాయము. అంతయుఁ గలిపి చదివిన "శ్రీ విశారదా ! నీ పైన మోహము నాపఁజాలను. రాని యెడల మరణమేను. రహస్య క్రీడను దేలనే వలయును" హా ! విశారదా ! నీ వన్నిటను జెడితివి. (యోజించి) ఈ దినము విశారదుఁడు వచ్చిన లేఖను జూపి ఇఁక మీఁదటఁ బోకుండఁ జేసి తీరెదగాక.

---

## తృతీయ రంగకము.

స్థలము :—ప్రేమ కుమారి భవనము.
సమయము :—పగలు పది గంటలు.

ప్రేమ కుమారి తన మందిరమును విచిత్రముగ నలంకరించి తానును బాగుగ శృంగారించుకొని సోఫాపైఁ గూర్చుండి యుండును. ఒక బల్లపై అద్దమును మఱికొన్ని గ్రంథములును నుండును. ఒక బల్లపై వీణె యుండును. కొన్ని చిత్తరు వుల గోడలకు వ్రేలాడ వేసి యుండును. ప్రేమ కుమారి రెండు విశారదుని పటములు గల గ్రంథమును తన చేతఁ బట్టి యుండును. ప్రక్కన సోఫా మీఁదనే తాను వ్రాసెడి చిత్ర ఫలక ముండును.

ప్రేమ—(సోఫా మీఁద దీర్ఘాలోచనతో నుండుట నభినయించి

యోజించి) ఏమిది. లేఖను గొని పోయిన హేమ యేలకో యింక ను రాకున్నది. విశారదుఁడు—ఇంట నుండెనో లేదో. (యోజించి తల యూఁచి) ఔను. అతని గృహమున లేకున్న మోహన రావు మందిరమున నుండునని కదా చెప్పితిని. (తలయూఁచి) ఒక వేళ నక్కడి కేగి యుండును. (పైకిఁ జూచి) మోహన రావు అసాధ్యుఁడని వినియు నేను హేమ నతని భవనమున కనుపుట పొఱపాటు కదా? పొఱపాటా ఇది కేవలము నా యవివేకము. అచ్చట విశారదుఁడే లేక అతఁడే యున్నచో హేమ నుండి రహస్య లేఖ విషయమును గ్రహించియే తీఱును. ఔరా! నే నెంత యవివేకి నైతిని. చిత్త చాంచల్యము మెండై వెఱ్ఱి పట్టులాగున నున్నది. లేకున్నఁ బట్ట పగలని యని యైన మది నెంచక, లేఖ నొసఁగి యెన్నఁ డిట్టి కృత్యములఁ జేసి యెఱుంగని హేమను బంపుటయే గాక, విశారదున కా లేఖ నొసంగియే రావలయు నని కట్టడిఁ జేయుట నా సాహసము గాక వేఱొండుఁ గలదా? పాపము. హేమ నా కోర్కి నెఱవేర్పఁ దా నెంత శ్రమ పడెనో. మా హేమ విశారదునకు—కాదు— నా మనోహరున కా కమ్మ నొసంగియే వచ్చినచో (సంతోషము నభినయించి వ్రేలి యంగుళీయమును దాఁకి) దాని కీ యుంగర ము నీయక పోను. (అటునిటుఁ జూచి) అయ్యో! ఇంకను హేమ రాకున్నదే. నా ప్రియ విశారదుఁడు రాకయే పోయె గదా. (ఉస్సురుమని సోఫాపై నానుకొని) అయ్యో. ఈ తాపమును భరించు టెట్లు? అయ్యో! ఓరీ! మదనా! నీ రూపు నిర్మూలమై పోను. నీకు మ్రొక్కెదను. నన్నేఁచ కుమురా. (కోపమునఁ దల యూఁచుచు) కానిమ్ము విశారదుఁడు రానిమ్ము. నీ గర్వ భంగముఁ జేయించెద. అయ్యో! (ఉస్సురు మని అటునిటుఁ బొర్లుచుఁ బ్రక్క నుండెడి గ్రంథమును గొని కూర్చుండి పుటలఁ ద్రిప్పుచు) అబ్బా! విశారదా! నీతో

సుఖింపఁ గల ప్రాప్తి నాకున్నదా? (అని యొక పుటలోఁ బద్యమునుఁ జూచుట నభినయించి)

ఉ.—"ఎంత తపంబు సేసిన మ
తెంత పతివ్రత నిష్ఠనున్నఁ దా
నెంత కృశించినన్ వ్రతము
లెన్ని యొనర్చిన నెన్ని పుణ్య తీ
ర్థాంతరముల్ చరించిన నొ
యారికి రూప విలాస వంతుఁడౌ
కాంతుని గౌఁగిలించిన సు
ఖంబు లభించునె - యూహలు - లేదిలన్." ౨౫

(సముఖము వేంకట కృష్ణప్ప నాయఁక మహాకవి)

(పుస్తకమును మూసి) కవిపుంగవా! సత్యము వచించితివి. లేదు. సౌఖ్యము ముమ్మాటికిని లేదు. (ఉస్సురుమని నిట్టూర్పు విడుచుచు యోజించి) ఇపుడొక వేళ విశారదుఁడు వచ్చినచో నే నేమి చేయ వలయును. నిన్నటి దినము సామ దానోపాయములచేఁ బ్రయత్నించి విఫల నైతిని. నేఁడు తక్కిన రెండు పాయములఁ బ్రయోగించి తీరెద గాక. అతఁ డేతెంచిన తోడనే మెల్లఁగా నా ప్రసంగము లోనికి దింపి యా వృద్ధ జమీందారునికిని విశారదునికిని భేదము బుట్టించి, తండ్రి యనక పైఁబడి చంపు నటులఁ జేసెద. అప్పటికి నా కోర్కి తప్పక నెఱవేరఁ గలదు. (అని లేచి యిటునటుఁ జూచి) ఏమో. ఇంకను రాలేదే. (మఱల సోఫాపైఁ గూర్చుండి) అయ్యో! కష్టము. కష్టము. విశారదా!

ప్రవేశము:—విశారదుఁడు.

విశా—(త్వరితగతి నభినయించి వచ్చుచు) అమ్మా! ఆలస్యమునకు క్షమింప వేడెద. మిత్రునితో మాటాడు చుండి నందున నించుక యాలస్య మైనది.

ప్రేమ—(విస్మయమున దిగ్గున లేచి) ఎప్పుడు వచ్చితివి? విశారదా! "నీకు నూరేండ్లాయుస్సు" నే నిప్పుడె యనుకొంటిని. ఇదేమి విశారదా! ఆశ్చర్యముగ నున్నది. నే నిన్ను మనసునఁ దలఁచి నపుడే నీవు విచ్చేసితివి. ఇరువురి మనసు లేక మైనటు లున్నది. పాపము. నీకు శ్రమ గలిగించితిని. విశారదా! ముందు సోఫాపైఁ గూర్చుండుము తర్వాతఁ జెప్పెదను. అయిన—అ—అదికాదు విశారదా!—హేమ—ఆలస్యముగ వచ్చినదా?

విశా—(సోఫా మీఁదఁ గూర్చుండి) హేమ (యోజించి) హేమ యెవరు?

ప్రేమ—(ఆశ్చర్యమున) మా హేమ రానేలేదా (చిఱు నవ్వుతో నొయ్యారముగఁ దలఁ ద్రిప్పుచు) మా హేమ—నిజము చెప్పుము.

విశా—(ఇంకొక ప్రక్కఁ జూచి) ఎవరో. నా కేమియుఁ దెలియదు.

ప్రేమ—నా లేఖను గొని హేమ రానే లేదా?

విశా—నా కొక్కటియుఁ దెలియదు. ఎవరి కాలేఖ?

ప్రేమ—(మెల్లఁగ నూర్ధ్వ ముఖమున నోర చూపులతో) నీకే—నేను—వ్రాసి పంపితిని.

విశా—ఎందు నిమిత్తము? అవసర కార్యముండినదా?

ప్రేమ—(వెంటనే) ఔను విశారదా! అందులకే—అత్యవసర కార్యముండి నందుననే పంపితిని.

విశా—అవసర కార్యమా. సెలవిండు. ఇపుడు చేసెదను.

ప్రేమ—ఇకేమున్నది. ఆ కార్యమే. (స్వగతమున) నా జాబు అంది నటులఁ గన్పట్టదు. హేమ కితని దర్శనమే లభించి నటుల లేదు? తర్వాత హేమను విచారించెద.

విశా—ఆ కార్య మేదియో యానతిండు.

ప్రేమ—(తనలో) పాపము గ్రహించ లేదు. అదియె—ఆ కృత్యమే.

విశా—సరి. వీణె గైకొనుఁడు.

ప్రేమ—(బల్లపై నున్న వీణెనుఁ బుచ్చుకొని తానుగూడ నా సోఫా పైనసె కూర్చుండును.)

విశా—(దిగ్గున లేచి చేతులఁ బిసికి కొనుచు దిక్కులఁ బరికించును.)

ప్రేమ—ఏమి విశారదా! భయమేల. కూర్చుండుము. (అని చేతిని బట్టి కూర్చుండఁ బెట్టును.)

విశా—అమ్మా! నేఁ గ్రిందఁ గూర్చుండెదను. (అని లేవఁ బోవ)

ప్రేమ—వలదు. వలదు. కూర్చుండుము. క్రిందఁ గూర్చుండనేల? స్థలము చాలదా? (జరిగి) నే నించుక జరిగెదను లెమ్ము.

విశా—(కూర్చుండి) పెద్దవారు పైనఁ గూర్చుండియుండ వారితోఁ గూర్చుండుట దోస (అర్థోక్తి)

ప్రేమ—(నవ్వుచు) అ—వ్వ—బాగున్నది. ఇదెక్కడి కర్మము. అందులకె కాఁబోలు పెద్ద దాన నగు నన్నుఁ చిన్న వాఁడవగు నీ కిచ్చి పెండ్లిఁ జేయ వలెనని మునుపు జమీందారు గారు నీ చిత్తరువును నా యభీష్టమును దెలిసికొన మా తండ్రిగారి కనిపిరి. నీ వెక్కడ నుంటివో? నీ కంటె నే నొక వత్సరము చిన్న తెలిసినదా? ఇపుడు చెప్పుము. ఎవరు క్రిందఁ గూర్చుండ వలెనో. నేనా లేక నీవా?

విశా—ఏమో లెండు. వీణా పాఠముఁ గానిండు.

ప్రేమ—(వీణెఁ బ్రక్కనిడి పటమును జూపుచు) విశారదా! చూడుము చూడు మా పటమును. ఆ సావిత్రి కలలోఁ జూచి మోహించిన సత్యవంతునిఁ దప్ప నన్యులఁ దనకంటఁ జూడ నను చుండ; సత్యవంతుఁ డల్పాయుస్కుఁడు గాన వేఱొకని గోరుమని యశ్వపతి బ్రతిమాలు చున్నాఁడు. ఆమె వినలేదు చూచితివా? తండ్రి యాజ్ఞ నుల్లంఘించినది. ఆమె కది తగునా?

విశా—ఔను. ఆమె స్వప్నమున జూచిన వానినే హృదయ పూర్వకముగఁ బ్రేమించి నందున నన్యునిఁ గోరినచోఁ దాను బ్రథమమునఁ గోరిన వాని కపరాధము గావించిన దగుటయే గాక, తన పతివ్రతాత్వమునకుఁ గళంకము వచ్చునను భీతిచే నా పట్టుఁ బట్టి సాధించెను. ఆమె కందులకే శాశ్వత కీర్తి ఘటిల్లినది. పతివ్రతాసిరోమణి యన నామెయే గదా.

ప్రేమ—జననీ జనకులు వేఱొక మంచి సంబంధమును జేసెదమని బ్రతిమాలినను వినక వారి యాజ్ఞ నుల్లంఘించుట సావిత్రికిఁ దగని పని యని నాయూహ.

విశా—అట్టు లనకుఁడు. తన శీలమును గాపాడు కొనుటకు జననీ జనకులు కాదా సర్వేశ్వరుఁడు వల దన్నను వినరాదు.

ప్రేమ—(చిఱు నవ్వుతో) సరి. కాని—విశారదా! (అని బుగ్గపై మెల్లఁగఁ గొట్టును.)

విశా—ఆ—ఆ—అదే మమ్మా!

ప్రేమ—(నవ్వుచు) ఏమట్లులికి పడెదవు. ఎదో పురుగుండినటు లుండ దానినిఁ దుడిచితిని. తొందఱ పడకుము. అదికాదు విశారదా! సావిత్రి కలలోఁ జూచిన పురుషుని మోహించెను గదా— కలలోఁ గనఁబడినవి నిజమగుట యరుదు. ఒక వేళ నిజమే యైనను; ఆ పురుషునికిఁ దెలియకుండ మోహించెను గదా. అతఁడు సమ్మతింపనిచో నేమి చేసి యుండెడిదో?

విశా—ఎందులకు సమ్మతింపఁడు. ఆమె గాఢముగఁ బ్రేమించిన సంగతిఁ దెలిసిన మీఁద సమ్మతించియే తీఱును.

ప్రేమ—(నవ్వుచు) అమ్మా! అది కాదు నాకుఁ గావలసినది. సత్యవంతుఁడు సమ్మతించినాఁడని తెలిసి యట్లనెదవు. ఒక వేళ సమ్మతింప లేదనుకొనుము. ఆమె యేమి చేయవలెను. (అని ఆవులించి యొడలు విఱుచుటయుఁ జేతులఁ బైకి

జాచుటయు నభినయించి) ఏమి? ఇంకొకనినిఁ గోరు కొన (అర్ధోక్తి)

విశా—ఆ—ఆ—తగదు. తగదు. అట్లు చేసినచో నామె శీలము నకుఁ గళంకము వాటిల్లును.

ప్రేమ—(వెను వెంటనే) సత్యవంతుఁడు సమ్మతింపనిచో సావిత్రి చేయవలసిన పని యేమి. ముందు-ఊ-దానికిఁ బ్రత్యుత్తరము.

విశా—(వెంటనే ఆలోచింపక) ఇతరులను గోర రాదు. బ్రహ్మచర్య నియతియే గతి. ఆమెయు నా విధముగనే చెప్పినది కదా?

ప్రేమ—సరి - ఆమెను సత్యవంతుఁడు ప్రేమింప లేదనుకొనుము. అప్పుడు నీ వనినట్లామె బ్రహ్మచర్య వ్రతమును బూన నున్న పుడు తలిదండ్రులు బలవంతమున నింకొకనికిఁ గట్టి పెట్టినను లేదా యే దుర్మార్గుఁడో తలిదండ్రులను బ్రోత్సాహ పఱచి తాను వివాహ మాడినను; సావిత్రి యేమి చేయ వలయును. ప్రథమమున మనసారఁ బ్రేమించిన వానిఁ బొందఁ గోర వలయునా? లేక విధిలేక తాళిఁ గట్టిన నామ మాత్రపు భర్తను బ్రేమించ వలెనా? ఆమె దేనికిఁ గట్టు పడవలయును.

విశా—(యోజించుచు స్వగతమున) ఇది క్లిష్ట సమస్యగ నున్నయది (అర్ధోక్తి)

ప్రేమ—(ఆలసింపక) ప్రత్యుత్తర మిమ్ము విశారదా!

విశా—(యోజింపక విధిలేక వెంటనే) ఏ మున్నది. ప్రథమమున నిశ్చల మనస్సుతోఁ బ్రేమించిన వానినేఁ (అర్ధోక్తి)

ప్రేమ—(ఆతురతతో) సెబాస్! విశారదా! నిజమే! నిశ్చయమే!! సత్యమే!!! చెప్పుము. చెప్పుము.

విశా—సత్యేతరము కాఁజాలదు.

ప్రేమ—సరి. ఈ పలుకుల జ్ఞాపక ముండనిమ్ము. మఱి—(అర్ధోక్తి)

విశా—ఈ మాటలతో నేమమ్మా. ప్రొద్దు పోవును. వీణె గైకొనుము.

ప్రేమ—ఉ—వీణె యటుండ నిమ్ము. వీణ యెవరికిఁ గావలయు. మనము బ్రతికినన్ని దినములీ వీణను వాయించు కొనుచునే యుండ వచ్చును. ఈ ప్రసంగము చాల ముఖ్యమైనది. మఱి—విశారదా!—ఇంకొక మాట నిశ్చల మనస్సుతోఁ బ్రేమించిన వాఁడు లభింపనిచో స్త్రీ బ్రహ్మచర్య నియతి నవలంభించు ననుకొనుము. ఆమె తాను విధిలేక పేరునకుఁ బరిణయ మాడిన భర్తను బ్రేమింపక, తొలుత హృదయ పూర్వకముగఁ బ్రేమించిన వానికిఁ దన యిచ్ఛఁ దెలిపిన నతఁడాపె నిశ్చలపుఁ బ్రేమను గ్రహింపక సౌందర్య రాశియగు నామెను విడిచి యింకొకతెను బరిణయ మాడిన నాడ వచ్చును గదా?

విశా—అవును. ఆ పురుషుఁడుఁ దన్నుఁ దొలుత నిశ్చలమగు ప్రేమతో బ్రేమించిన నామె మనస్సంకల్పమును గ్రహించినను గ్రహింపక పోయినను; నా తరుణి యింకొకని సతియని యనిపించు కొనిన సంగతిఁ దెలిసికొని యామెకు లోఁబడినఁ బరసతీ గమన పాపమున కొడిఁగట్ట వలసి యుండును గనుక, నత్తెఱంగు వదలి వేఱొక యవివాహితను అగ్నిసాక్షిగఁ బరిణయ మాడుట లెస్స. కాదే మమ్మా!

ప్రేమ—ఆ స్త్రీ తాను నిక్కముగఁ బ్రేమించిన వాఁడు నిరాకరించినచో, వేఱొకని పురుషునివలెఁ గోరినఁ దన శీలమునకుఁ గళంకము రాఁగలదని, తన మనోహరుఁడు లభింపక పోయినందున విరక్తి జనించి ప్రాణ త్యాగమునకు సాహసించిన నామెను గాపాడి సంతోష పఱచుట మానవ ధర్మము కదా. ఆమె నెటులఁ దృప్తి పఱుప వచ్చును. ఏ పాపము నెఱుఁగని యామెను, తన కొఱకై ప్రాణములఁ బాయు తరుణీమణిని నకాల

మృత్యువున కర్పింప వచ్చునా? ఆమె నెట్టులఁ దృప్తి పఱుప వలయు.

విశా—(యోజించి) ఆమె తన మనోహరుఁడు తన్ను నిరాకరించి వేఱొక తెను బాణిగ్రహణ మొనరించు కొనెఁగదా యని పరితపింపకుండఁ జేయుటకును ఆమెను ప్రేమించి పరనారీగమన పాపమునఁ బడకుండ నుండుటకును, దాను బ్రహ్మచర్యము నవలంబించియే తీర వలయును. అట్లిరువురును బ్రహ్మచర్య దీక్షతో మోక్షమును సాధింప వలయునే కాని వేఱు విధమునఁ జరింప రాదు.

ప్రేమ—(స్వగతమున) ఔరా? ఇతఁడే రీతిని దొరకఁడే. కానిమ్ము. ఇంకను గొంత నిదానించెద. (ప్రకాశముగ) అయిన విశారదా! అతఁడొక వేళఁ బరిణయ మాడిననుఁ బాపము లేదంటివి కదా?

విశా—అవును.

ప్రేమ—ఆరీతిఁ దాటాకులలో లిఖించిరి కాఁబోలు.

విశా—అవును. ఏమను కొంటిరి. ఆరీతి స్మృతులే చాటు చున్నయవి.

ప్రేమ—అవి స్త్రీల కన్వయింపవు కాఁబోలు.

విశా—(తలఁ ద్రిప్పుచు) ఊహు—లేదు లేదు.

ప్రేమ—ఇదెక్కడి చట్టములు విశారదా? (లేచి) స్త్రీ తాను స్వప్నమునయో లేక చిత్రఫలకమునయో చూచి హృదయ పూర్వక, నిశ్చయ నిష్కళంక ప్రేమతో మోహించిన వాఁడు లభింపనిచో నామె బ్రహ్మచర్యము నవలంభించియే తీఱవలయును, లేకున్నఁ బతివ్రతా లక్షణములకు లోటు వాటిల్లును. పురుషుఁడు మాత్ర మామె ప్రేమ నెఱింగియు వేఱొక తెను వివాహమాడవచ్చునా? ఉండ నెంచిన బ్రహ్మచర్య నియతి నుండ వచ్చును. ఉండ నెంచిన—ఎవ్వఁడుండఁ గోరును. స్త్రీల

కన్నియుఁ గట్టు బాళ్లే. వారు తాము హృదయ పూర్వకముగ ప్రేమించిన పురుషుని వరించుటకు స్వాతంత్ర్యమే లేక పోయెను గదా? ఇది పురుషుల దౌర్జన్యము కాదా విశారదా?

విశా—అదే మమ్మా! పూర్వులు స్త్రీల కెక్కువ స్వాతంత్ర్య గౌరవ ముల నొసంగి యుండ మీరు లేదనెదరు?

ప్రేమ—యువతులకు స్వాతంత్ర్యమే లేదని నా నిశ్చయము. ఇపుడు భరతఖండమున మా వారు స్వాతంత్ర్యమునకై పెట్టెడి గోల వార్తాపత్రికలఁ జదువు నీకుఁ దెలియదా? ఎందులకీ మాటలు. స్త్రీల కాస్వాతంత్ర్యమే యున్న నాకీగతి యేల పట్టును. నేను మనసారఁ బ్రేమించిన వానిని వివాహమాడ నీయక పోవుటయే గాక, బ్రహ్మచర్య నియతినిఁ బాటింపనున్న నన్ను, బలవంతమున నీ వృద్ధ జమీందారునకుఁగట్టి పెట్టిరి. నేను మంగళ సూత్రమును గట్టనియ్యకున్న—నా బ్రాహ్మణుఁడే—(జ్ఞాపకముఁ జేసికొనుట నభినయించి) ఔను. ఆ బ్రాహ్మణుఁడు తానేకట్టి జమీందారు కట్టె ననిపించెను. ఎక్కడఁ జూచినను నీ బ్రాహ్మణుల ప్రాబల్యము లేక కాకున్నది. ఇందెంత మాత్రము న్యాయమున్నదో—నీవే—చెప్పుము.

విశా—(దిక్కులఁ జూచి స్వగతమున) ఔరా! ఈమె కడకు తన సంగతి లోనికి దించెను. ఇదెఱుంగక నే నేమేమో పల్కితిని గదా.

ప్రేమ—ఏమి విశారదా! ఆలోచించెదవు. (అని భుజముఁ బట్టి యూఁపి) ఇన్నిటికిఁ దగినట్లు జవా బిచ్చిన వాఁడవు దీనికి సమాధానముఁ జెప్పఁ జాలవా?

విశా—ఈ ప్రసంగముతో నేమమ్మా. మన పని కానిమ్ము.

ప్రేమ—ఆ—(నవ్వుచు) అందులకే యింత శ్రమ. తెలిసినదా?

విశా—ఏమి శ్రమ (కూర్చుండి) ఇదిగో వీణను గైకొనుఁడు (అని యిచ్చును.)

ప్రేమ—(కూర్చుండి వీణ నందుకొని ప్రక్కనఁ బెట్టి) అది కాదు విశారదా! చూచితివా నీ తండ్రియే నీ కెంతటి ద్రోహముఁ జేసి యున్నాఁడో.

విశా—నా కేమి ద్రోహము గావించెను.

ప్రేమ—ఇఁకేమి చేయ వలయును? చాలదా. తొలుత నీ చిత్తరువును జూచి మోహించియున్న నన్నే తాను నా రూపమును బటమునఁ జూచి మోహితుఁడై కృత్రిమమునఁ బెండ్లాడెను. తానే నన్ను నీకని మాటాడి యిట్లు చేయుట యెంత దోస మెంత దోసము. ఇంతటి ద్రోహిని నీవు తండ్రివలెఁ బ్రేమించుట పొఱపాటు సుమా. అట్టి వానిని మన నియ్యవచ్చునా? నేనై యున్న ఖడ్గమున నొకటి రెండు గావించి యుందును? ఛీ—వాఁడు నీ తండ్రి యెటులగును? (అర్ధోక్తి)

విశా—ఆ—ఆ—అమ్మా! వలదు వలదు. నా యెదుట నా ప్రియతముఁడగు తండ్రిని దూషింప వలదు. నే వినఁ జాల. ఈ కర్ణకఠోరములగు పలుకులు మీవంటి సాధ్వీమ తల్లి నోట రారాదు.

ప్రేమ—(స్వగతమున) అబ్బా! ఇతని మనస్సును ద్రిప్పుట కష్టమే. నా భేదోపాయము విఫలమ యినట్లే. (తల యూఁచి) ఇఁక నా స్వశక్తినిఁ గొంత యుపయోగించి కాకున్న; దండోపాయమున సాధించెదఁ గాక. "దేవున కైనను దెబ్బయే గురువు" (అని తల నాడించి) కానిమ్ము.

విశా—(అంతలో) అమ్మా! భోజనమునకు వేళ కావచ్చినది. వచ్చినందులకుఁ గొంత వీణాపాఠముఁ గానిండు. పోవలయును.

ప్రేమ—ఎక్కడికిఁ బోవలయు. నిన్నిక్కడనే భోజనమునకు నిలుప

నెంచి ముందుగనె నే వంట సిద్ధము చేసి యున్నాను. (గడియారమును జూచి) అవును వేళయైనది. భోజనము చేసి వత్తము రమ్ము. (అని చేయిఁ బట్టి లాగఁ బోవును.)

విశా—అమ్మా! క్షమింపుము. ఇంకొక దినము వచ్చెదను. మా తల్లి నాకొఱకుఁ గాచుకొని యుండును. రాత్రియును గృహమున కేగిన వాఁడను కాను. వీణా పాఠము సాయంకాలము కాని త్తము. సెలవిండు. (అని పోఁబోవును)

ప్రేమ—అ—మ్మా—నిన్నుఁ బోనిచ్చుటకేనా రానిచ్చినది. నీతోఁ గూడ భుజింపవలెనని యూరకున్నాను—నిక్కము వచించెద. నేఁడు నా భవనమున భుజింపనిచో నే నుపవసింప వలసి వచ్చును. ఏమి విశారదా! యీ నా స్వల్ప వాంఛ నెఱ వేర్పవా? నా యింట భుజించినఁ దప్పా. రమ్ము వేళ యైనది.

విశా—(స్వగతమున) భుజింపక పోయినచో నీమె మనసు నొచ్చుకొనును. పాపము నాకొఱకై సిద్ధము చేసిన దానిని భుజింపక నిరాకరించి యీమెను నొప్పించుట ధర్మము కాదు. నా నిజ జనని కేదో యొక మాటఁ జెప్ప వచ్చును (అని యోజించు చుండ.)

ప్రేమ—మీ తల్లి యెదురు చూచు చుండునని యోజింపఁ బని లేదు. కావలసిన సందేశ మంపి యీమెను భుజింపు మనుము—సేవకుని బిలుతునా?–ఏమి విశారదా! అడుగక అడుగక యడిగిన యీ నా కోర్కిఁ దీర్ప ననుమానింతువు.

విశా—(తనలో) ఇఁకఁ దప్పదు. (ప్రకాశముగ) కానిండు. మీ యిష్టము. నన్ను మాత్రము భోజనమైన తోడనే యింటికిఁ బంపవలయును.

ప్రేమ—నడువుము. (అని విశారదుని ముందుఁ బోవునట్లుఁ జేసి తాను వెనుకఁ బోవుచు జనాంతికముగా) ఇఁక భయము లేదు.

నా ప్రయత్నమున కను కూలమగు చిహ్నములుఁ బొడచూపు చున్నయవి. ప్రాప్తి యెటులున్నదో. (అని లోపలి కేగును.)

---

## చతుర్థ రంగకము.

స్థలము :—క్లబ్బు.
సమయము :—పగలు 12 గంటలు.

రాజా భువనమోహనరాయ బహదూర్, జడ్జి రమేశదత్తు నరేంద్రుఁడు, మోహనరావు మఱి యిద్దరు గూర్చుండి భుజించు చుందురు.—

రమే—ఈ దినము పదార్థము లన్నియుఁజాల రుచిగా నున్నవి.

భువ—పాయసము బహు రుచిగా నుండ లేదా ?

మోహ—(నవ్వుచు) తమ కింకను గావలసి యున్నది కాఁబోలు.

భువ—అబ్బె - నా కక్కఱలేదు.

రమే—ఏమండీ! జమీాందారు గారు. షరబత్ పంచుటకు మణి మాల వచ్చునంటిరే. ఏది ?

భువ—బాలోజీ! మణిమాల రాలేదా !

ప్రవేశము :—బాలోజీ.

బాలో—బాబూ ! వచ్చియున్నది. షరబత్ గైకొనివచ్చుచున్నది.

ప్రవేశము :—మణిమాల.

మణిమాల షరబత్ తో నుండిన గాజు కూజాను దీసికొని పాటఁ బాడుచు వచ్చి, అందఱికి నమ స్కరించినట్లు వంగి, పాడుచు నాట్యమొనరించుచు షరబత్ ను పంచుట ముగించిన తోడనే.

భువ—(ఉన్నటులుండి తొందఱ నభినయించి) మిత్రులారా! మరచితిని,

నేఁడొక అవసర కార్యమున్నది. వెళ్లెద క్షమింపుఁడు. (అని పోవును)

రమే—సరి మణిమాలా! నేఁడింతటితో చాలించి రేపు రమ్మా.

మణి—చిత్తము. (అని నమస్కరించి పోవును)

(యవనిక పడును.)

---

పంచమ రంగము.

స్థలము :—ప్రేమకుమారి మందిరము.

సమయము :—పగలు 12-30. గంటలు.

ప్రవేశము:— విశారదుఁడు.

విశా—(చేతి రుమాలుతోఁ జేతులను మూతిని దుడుచుకొనుచు వచ్చును.)

ప్రేమ—(బయటికి ముఖము మాత్రము జూపి వెళ్లుచు) విశారదా! సోఫాపైఁ గూర్చుండుము. ఇప్పుడే వచ్చెద.

విశా—మంచిదమ్మా! (అని కూర్చుండి తనలో) ఈ వెఱ్ఱితల్లి నాయందెంత దయఁ గలిగి యున్నది. నన్ను వివిధ పాకములచేఁ దనియింపఁ జేసెను. ఇన్ని యెపుడు సిద్ధము చేసెనో.

పునః ప్రవేశము:— ప్రేమకుమారి.

ప్రేమ—(తాంబూలపుఁ బళ్లెరమును గైకొని వచ్చుచు) విశారదా! తాంబూలమును వేసికొనుము. (అని వెండి తట్టనుఁ దొడలపై నిడుకొని చిఱునవ్వుతో ఆకులకు సున్నముఁ బూయుచుండును.)

విశా—అమ్మా! నాకుఁ దాంబూలము వేసికొను నభ్యాసము లేదు.

ప్రేమ—(ఒయ్యారముగ) ఆ—నే నలవాటుఁ జేసెదను. ఇదిగో (అని వక్కపొడి నిచ్చుచు) నాచేఁ గైకొన రాదా? నా హస్తము లంతటి పాపము చేసినవా? నీవు విడెము గైకొనకున్న నేనును మానెదను లెమ్ము. (అని తట్టనుఁ బ్రక్కనఁ బెట్టును.)

విశా—(తనలో) పాపము. అప్పుడే చిన్నముఖము జేసికొనెను. ఆమె కోరిక ప్రకారము తాంబూలము వేసికొని యామెకు సంతోషముఁ గలిగించెద. (ప్రకాశముగ) అమ్మా! అలవాటు లేక యట్లంటి నంతయే. ఆ తట్టను నా కిందు. నేను వేసి కొనెదను (అని తీసి కొనఁ బోవును.)

ప్రేమ—(నవ్వుచు నొయ్యారమునఁ దీసికొన నియ్యక) ఆ--అమ్మా!- నీ కలవాటు లేదు. నేను మడిచి యిచ్చు చుండెదను. అదియుఁ గాక నేఁగూడ వేసికొన వలెనుగదా. ఇదిగో పొడి (అని యిచ్చును.)

విశా—(పొడిని గ్రహించి నోటిలో వైచికొని) ఆకులను నా చేతికిందు, నే మడిచి వేసికొనఁ గలను.

ప్రేమ—(నవ్వుచు) నీకుఁ దెలియదంటివి గదా విశారదా! (అని తాను గూడ వక్కపొడిని నోట వైచికొని) అదికాదు--ఊఁ-- (అని ఆకుల మడఁచుచు) మరీ—

తే. గీ. వయసు వాఁడవు తగినట్లు ♦ బలము కలదు
అంద చందము లన్నియు ♦ నమరి యుండె
కాంత లేరును నింగూడి ♦ కలసి తిరుగఁ
గోర లేదొకో తెల్పువి ♦ శారదాఖ్య!— ౨౬

విశా—ఆ సంగతు లెందుకమ్మా! నా వంటి వానిని గోరు దౌర్భాగ్యురాలుండు (అర్ధోక్తి)

ప్రేమ—(వెంటనె)ఆ—ఆ—కాదు. కాదు. అంతటి యదృష్టవంతురాలుండునా యనుము. ఇదిగో. అని ఆకు మడుపు నొసఁగును.)

విశా—తీసికొని నమలుట నభినయించును.)

ప్రేమ—(ఇంకొక యాకును మడిచి తాను వేసికొని, మఱియొక దానిని మడుచుచు) తాంబూలపు రుచి తెలిసినదా. (నవ్వుచు) అది కాదు విశారదా! నిన్నవరును బ్రయత్నించి యుండనేలేదా?

విశా—అబ్బా! లేదు పోవమ్మా!

ప్రేమ—నీవైన (అర్ధోక్తి)

విశా—ఊ - హూ - అంత పాపమా!

ప్రేమ—విశారదా! (అని భుజముపైఁ దట్టి) చూడు మా పటమును. రావణుఁడు రంభను బట్టి యెటుల లాగుచున్నాఁడో. పైఁటను లాగి వైచినాఁడు చూచితివా?

విశా—(చూచుట నభినయించి) రావణుఁడు కడు దుర్మార్గుఁడు సుమా.

ప్రేమ—అతఁడేమియుఁ గాదు - అల్లదిగో - ఆ చిత్తరువును జూడుము. తార చంద్రునికి సంపంగినూనె నెటులంటు చున్నదో.—ఆ పటమును చూతువు రమ్ము. (అని విశారదుని చేయిఁ బట్టి పిలుచుకొని పోయి) చూడుము. చిత్రాంగి సారంగధరుని బలిమిఁ బట్టినది. మోహమెంత చేయునో చూడుము. ఇటు రమ్ము. (అని పిలుచుకొని పోయి పటముల నిలువ యుంచు పాత్రమును Album దీసి) ఈ చిత్తరు వెవరిది విశారదా!

విశా—(చూచి) నాదియె. ఇదికడు చిత్రముగ నున్నయది. ఈ తోటలో నిలిచి నే నెప్పుడును నా ఛాయా పటమును దీసికొనలేదు కదా. ఇటు లెవరు తీసిరి. వీ రెటుల వచ్చెను. (అని తానే యుంచుకొనఁ బ్రయత్నింప)

ప్రేమ—(నవ్వుచు అతనినుండి లాగుకొని) అమ్మా! (అని తలఁ ద్రిప్పుచు) ఆకసమునుండి మొన్న సాయంకాలము జారి పడినది.

(అని యింకొక దానిని జూపుచు) దీనిని చూడుము. బాగున్నది కాంబోలు.

విశా—(చూచి) అయ్యో! ఇదేమి కర్మమమ్మా. జమీందారుగారు చూచినఁ బ్రమాదము గలుగును. అకటా! (భయము నభినయించి) దీనినిట్లుఁ జిత్రించి మీకొసంగిన వాని పేరుఁ జెప్పుఁడు.

ప్రేమ—ఏల ?

విశా—(కోపమున) వానిని పంత మార్చెదను.

ప్రేమ—చెప్ప మనెదవా ?

విశా—ఊఁ—చెప్పుఁడు.

ప్రేమ—విశారదుఁడు—కాదు—కాదు—అతనిపై నాకుండు ప్రేమ.

విశా—ఇది పరిహాసమునకు సమయము గాదు తల్లీ !

ప్రేమ—నేనే చిత్రించితిని బాగుగ లేదా విశారదా ! (అని సమీపమున కేగును.)

విశా—(దూరమేగి) మీ బాఁగు అటుండనిండు. నాప్రాణములకు ముప్పు దెచ్చితిరి. అది కాదమ్మా! మన మేక శయ్య నలంకరించి - అయ్యో!—(గ్రుక్క మ్రింగి) నోరాడదు - ఉన్నటుల లిఖించితిరే. జమీందారు గారు చూచిన నా ప్రాణములఁ దీయక పోఁడు. లేని సంగతుల నిట్లు చిత్రించిన మీకు శ్రేయస్కరము గాదు.

ప్రేమ—శ్రేయస్కర మేల కాదు. అట్లు కావలయులని నీకుఁ జూప లిఖించితిని. అది కాదు విశారదా! నీ వేమి యింత ధైర్యము లేని వాఁడవు. ఏల భయపడెదవు ?

విశా—నాకేటి భయమమ్మా.

ప్రేమ—(సంతోషమున) ఆ - మఱి యాలస్యమేల ?

విశా.—ఏమి చేయవలెను.

ప్రేమ—(స్వగతమున) అబ్బా! ఇంకేరీతి చెప్పఁగలను. (ప్రకాశముగ) ఏమి చేయవలసినదియు నన్నుఁ జెప్పుమందువా? నీవు గ్రహింపలేదా?

విశా—ఏమోనమ్మా! నీ మాటలు నాకు బోధపడుట లేదు.

ప్రేమ—(ఆశ్చర్యమున) అమ్మా!—(నోరు మూసుకొని) ప్రియా!—ఇదేమి పాపము.

విశా—(విస్మయమున) ప్రియా!—ఆ—ఆ—తల్లీ! నన్నుఁ బ్రియాయనెదవు. నన్నెవరినిగా భావించితివి?

ప్రేమ—(తనలో) ఇఁక నే నాపఁ జాల. (ప్రకాశముగ) మనోహరా! నన్నిఁక మీఁదట నీ వమ్మా! యని పిలువ వలదు. తెలిసినదా?

విశా—(ఆశ్చర్యమున) ఆ—ఆ—(నోరు మూసికొని) మఱేమ (అర్ధోక్తి)

ప్రేమ—మఱేమన వలయునా. (నవ్వుచు) అన్నియు నా నోటనె చెప్పించు చున్నావు. కానీ—కానీ లెమ్ము. (అని తల యూఁపి) ఏమని పిలువ వలయునా? ప్రేయసీ! యనవలయు. హృదయేశ్వరీ!! యని పిలువ వలయును. ప్రాణేశ్వరీ!!! యని సంబోధింప వలయును. ఇప్పుడైనఁ దెలిసినదా?

విశా—(చెవులు మూసు కొని, హరి హరీ! పాపము శమించుఁ గాత.

ప్రేమ—ఇదేమి పాపము.

విశా—అమ్మా! నేను నిన్నటి దినమే మీ చర్యలఁ దిలకించి, యను మానించి, మీరు నా శీలమును బరీక్షించుట కట్లంటిరి గాని వేఱు గాదని నే పొఱపాటు పడి వచ్చితిని. నేఁడు కడు దుర్దినముగ నున్నయది. నేఁ బోయెద. (అని లేచును)

ప్రేమ—(లేచి) ప్రాణకాంతా! ఎక్కడికి లేచితివి. శయన గృహమునకా? రమ్ము. పోదము. అది ముందే యలంకరింపఁ బడియున్నది లెమ్ము. (అని చేయిఁ బట్టును.)

విశా—(విడిపించుకొని) అమ్మా! క్షమింపుము. అట్టి పాపపుఁ బలుకుల నాఁడకుము. నే నీ కుమారుఁడ నగుదును.

ప్రేమ—ఔనా! నాకు మారుఁడవా! అదియే కావలసినది ప్రియా!

విశా—అయ్యో! నీకు మారుఁడను కాదమ్మా! నీ కుమారుఁడను.

ప్రేమ—ఎవరు నీ తండ్రి?

విశా—జమీందారుగారని తెలియదా?

ప్రేమ—అయిన.

విశా—ఆయన నీ పతి (అర్ధోక్తి)

ప్రేమ—ఎవఁడు నా పతి. జమీందారా. అతనిని నేఁ బ్రేమించితినా. వివాహమాడితినా. లేదు. లేదు. మీదు మిక్కిలి స్వప్నావస్థ యందైనను అతని గోరిన విధము చూపట్టదు. ప్ర ప్రథమమున మోహించినది నిన్ను సుమా. అతనిని నా భర్త యందు వా. ఇది నీకుఁ దగునా. నాకు నీవే రెండవ పతివిఁ గట్టఁ దలఁచితివా?

క. పతికిని దొలుతగా దలఁచిన
పతి నొక్కనిఁ దప్ప నన్యుఁ ♦ బాటించుట సం
గతియటరా? యిటు లనుటకు
మతిచెడెనా? మోహనాంగ ♦ మర్యాదటరా? ౨౭

అదికాదు విశారదా! ఇంతకు ముందు సావిత్రీదేవి విషయమైన ప్రసంగము వచ్చినపుడు; స్త్రీ తొలుత నేరిని భావించునో వానినె పతిగా నెంచి తీఱవలెననియు వేఱొకని భావించినఁ బాతివ్రత్యమునకు భంగము వాటిల్లు ననియు నీ నోటనే కదా చెప్పితివి. ఇంత

లోనె మఱచితివా? ఔరా! ఏమి నీ యుపస్థితి బుద్ధి (Presence of mind) కడు శ్లాఘనీయమైనదిగ నున్నదే.

విశా—(యోజించుచుఁ బలుక కుండును.)

ప్రేమ—(తొడ మీఁదఁ జేయి వైచి) ఏమి, యోజించెదవు.

విశా—(ఆమె చేతిని దీసి వైచి) ఆ సంగతి వేఱు. ఈ సంగతి వేఱు. (అని యింకొక ప్రక్కఁ జూచును.)

ప్రేమ—అదెట్లు విశారదా! మానవు లందఱికి ఒకటే చట్టమా? లేక ఒక్కొకరి కొక్కొక శాసనమా. (వీపునఁ దట్టి) భయ పడకుము విశారదా! నీ యర్ధాంగినగు నన్ను తాను బలవంత మునఁ గవయఁ బ్రయత్నించు చున్నాఁడు. నే నేదో యొక సాకు చెప్పి నన్నింతవఱకుఁ దాఁక కుండఁ జేసి నా పాతివ్రత్య మును గాపాడుకొంటిని. ఇట్లెన్ని దినములని యుండఁ గలను. నే నేమి పుట్టు యోగినినా? నే నెవరికై చంద్రుని కొఱకుఁ గాచుకొని యుండు చకోర పక్షివలెఁ గాచుకొని యుంటినో అట్టి నీవు నేఁడు నా పుణ్యవశమున అదియును నొంటిపాటున లభించితివి. నీ విఁకఁ దప్పించుకొని పోఁజాలవు. విశారదా! నీ విపుడు మంచిదనుము—చూడుము—ఈ సారి యా ముసలి వాఁడు నన్నుఁ జెనక వచ్చినచో నేమగునో. అది కాదు ప్రియా! నీ కింత యపరాధముఁ జేసిన వాని పైన నింత భక్తి యేల?

విశా—మీ రేమి చెప్పినను సరియే. ఆయన నాకుఁ బితృ సమా నుఁడు. మీరు మాతృ సమానులరు.

ప్రేమ—(తనలో) ఔరా! ఎక్కడికిని లొంగఁడే. (తలయూఁచి) కానిమ్ము. (ప్రకాశముగ) విశారదా! ఇటు రమ్ము. (అని చేయిఁబట్టి పిలుచుకొని పోయి ప్రక్కన మందసమున నున్న పటమునుఁ జూపి) ఈ చిత్తరు వెవ్వరిదో చూడుము.

విశా—(తీసికొని చూచి) నాదియె.

ప్రేమ—దీనిని నీయొద్దనుండి యెవరైనఁ దీసికొనినట్లు జ్ఞాపకమున్నదా?

విశా—(స్వగతమున) నా తండ్రి నన్నొకసారి యడిగి తీసికొని నటుల జ్ఞాపకము. (యోజించి ప్రకాశముగా) ఔను. నేను శాంతి నికేతనమున కేగక పూర్వ మొకనాఁడు నా తండ్రి నన్నడిగి పుచ్చుకొని యుండెను.

ప్రేమ—ఇదిగో—చూడుము—ఈ ముత్యముల వంటి యక్షరములు నీవేనా—నీ వ్రాఁతయే కదా?

విశా—(చూచి) అవును. క్రింద నా పేరు వ్రాసి యిమ్మన నిచ్చి యుంటిని. అబ్బో! ఇది చాల కాలము నాఁటి సంగతి.

ప్రేమ—అవును నే మాటాడునది అప్పటి సంగతియే. అప్పుడె నిన్నుఁ బ్రేమించుటకై దీని నా ముసలి పీనుఁగు నాకుఁ బంపి యుండెను. అప్పుడు నే నిన్ను మనసారఁ బ్రేమించి మోహించి యప్పటి నుండియు నిన్ను నా ప్రాణ కాంతునిగ నెన్ని మూఁడు వేళలఁ బూజించు చున్నాను. అన్యునిఁ గలలోఁ గూడ ననుకొన లేదు సుమా. విశారదా! నీ యందలి నా మోహమును వెల్లడించితిని. నీవు నిరాకరించిన—నీ యాన—నాకు మరణమే గతి. వేఱు దారి లేదు. ఇది ముమ్మాటికి సత్యము! సత్యము!! సత్యము!!!

విశా—(తనలో) ఔరా! ఈమె నన్నింతగఁ బ్రేమించి యున్నది. నే నంగీకరింప కున్న నీమె మరణించుట నిక్కవము. లోక రక్షకా! నన్నింతటి చిక్కు సమస్యలోఁ బడవైచి నా శీలమును బరీక్షించు చుంటివి. ఒక ప్రక్క స్త్రీ హత్యయు, మాతృ ద్రోహమును, వేఱొక వంక పితృ ద్రోహమును గల్పించి

నన్ను హాతమార్పఁ జూచెదవా? కానిమ్ము. ఎంత వఱకుఁ బరీక్షింతువో చూచెద (ప్రకాశముగ) అమ్మా! (అర్ధోక్తి)

ప్రేమ—(విసుగుతోఁ జేయి విదళించుచు) ఇస్సీ—అమ్మా యనవల దని చెప్పలేదా (అర్ధోక్తి)

విశా—అమ్మా! నీ వేమైన నను ము. పరసతీ గమనము పాప కూప మునఁ బడద్రోయును. నా ప్రాణములన్నైన గోసంగెదఁ గాక. నే నికార్యమునకుఁ బూనఁ జాల.

ప్రేమ—మనోహరా! ఇందువలనఁ బాపభీతి యొకింతయు లేదు. తొలుత నే నిన్నుఁ బ్రేమించి యుండనిచోఁ బాపమే. పాప మనుటకు.

సీ. వెలిపెట్టిరే బాడ ♦ బులు పరాశరుఁ బట్టి
దాశకన్యా కేళిఁ ♦ దప్పు సేసి
కులములో వన్నెత ♦ క్కువ యయ్యెనే గాధి
పట్టికి మేనక ♦ చుట్టఱికము
ననుపుకాఁడై వేల్పు ♦ నాగవాసముఁ గూడి
మహిమఁ గోల్పడియెనే ♦ మాంద కర్ణి
స్వారాజ్య మేలంగ ♦ నీరైరె సుర లహ
ల్యాజారుఁడైన జం ♦ భాసురారి

తే. గీ. వారి కంటెను నీ మహ ♦ త్వంబు ఘనమె
పవన పర్ణాంబు భక్షులై ♦ నవసి యినుప
కచ్చడాల్ గట్టుకొను ముని ♦ ముచ్చు లెల్ల
తామరసనేత్ర లిండ్ల బం ♦ డాలు గారె.— ౨౮

(అల్లసాని పెద్ద నామాత్యుఁడు)

వారికే లేని పాపపుణ్యములు మనకా. స్త్రీ తనకై తాన వచ్చి కోరినచోఁ బురుషుఁడు నిరాకరింప రాదని శాస్త్రములు ఘోషించు చున్నవి గదా.

ఉ. ఏలర జాలిఁ బెట్టెదివు
డేలర వేగమె యెన్ని పువ్వులన్
వ్రాలదు తేఁటి యట్లు మగ
వాఁడను వానికిఁ దోస మున్నదే
గాళిని దాన పైఁబడిన
భామను బిగ్గ కవుంగలించినం
జాలదె యింద్ర భోగ పద
సౌఖ్య మనన్మఁటి వేతె యున్న దే.—

(శేషము వేంకట కవి)

కనుక నేను ప్రేమించి వచ్చితిని గాన నీకుఁ బాపభీతి యుండదు. ఇఁక నేను గదా భయపడ వలసినది. ఆ భయము నాకు లేదు. ఎందులకన నే నెవనిని ప్రథమ వీక్షణమునఁ జూచి మోహించి ప్రేమించితినో అట్టి నిన్నే పొందఁ గోరితిని. భార్యాభర్తలుఁ గలయుట తప్పనువారుండరు. కనుక సంశయింపకుము.

విశా—దేవీ! వారు దేవతలు. వారికిని మనకును బోల్చుకొన రాదు. పురుషు లితర స్త్రీల బొందఁ గోరుట సరియా? అది దోసము కాదా? ఎవరు చెప్పిరి. అట్టి వ్రాఁత లుండిన వానిని బాటించుట తప్పు. స్త్రీ పరపురుషుని సంగమమున కాసించిన నెంత దోషమో, పురుషుఁడు పరనారులఁ గోరిన నంత తప్పు. స్త్రీ పతివ్రత యనిపించుకొను నట్లె పురుషుఁ డేకపత్నీ వ్రతుఁ డనిపించు కొన వలెనే గాని వేఱు విధముగ నడువ రాదు.

ప్రేమ—సరియే. మన మొకరి నొకరుఁ బ్రేమించుటలో పై వ్రతదీక్ష నిర్వహించిన వార మగుదుమే కాని వేఱుకాదు.

విశా—పరసతీ గమనమే మహా భయంకరమగు పాపకూపమునఁ బడఁ ద్రోయు చుండ నీవు మాతృద్రోహము జేయు మనెదవు. (భయము నభినయించుచు) అబ్బబ్బో! శమనపురిని యమభటులు బెట్టెడి బాధల సహింపఁ గలమా!

సీ. లోతెఱుంగఁగ రాని ♦ లోయలలోఁ బడఁ
ద్రోసి యాపై ఱాలఁ ♦ ద్రోతు రంట
కళపెళఁ దైలంబుఁ ♦ గ్రాగించి దానిలోఁ
బడవైచి మలమల ♦ మాడ్తు రంట
ఱెక్కుఱంపము తోడ ♦ నుర్విపై బడ వేసి
ముక్కలుగాఁ గోసి ♦ పూడ్తు రంట
కడికండలుగఁ జేసి ♦ గానుగలో వైచి
వెస రక్తమును పిండి ♦ వేతు రంట

తే. గీ. అగ్ని గుండము నందువా ♦ రల్లి త్రోసి
పూని బల్లెము లంగొని ♦ పొడుతు రంట
అయ్యొ! భయమున గుండియ ♦ లవియు చుండె
జముని బాధలఁ బడుట య ♦ సాధ్య మమ్మ.— 30

ప్రేమ—(నిస్పృహతో) సరి. నీవు నిరాకరించిన నేను గదా దుర్మరణముల పాలు గావలసినది. కానిమ్ము. నీకై నేఁ బ్రాణముల నర్పించిన మీఁద నింకొక వనితను వివాహమాడి సుఖింపుము. నా ప్రాప్తి (అర్థోక్తి)

విశా—అమ్మా! నీ వేల మరణింప వలెను. అట్టు లొనరింప నేల?

ప్రేమ—నిన్ను దక్క నే నన్యులఁ దాఁకి నా పాతివ్రత్యమును జెఱుచుకొనఁ జాల. నీవు నిరాకరించితివి. నా కిఁక మరణమే శరణ్యము.

విశా—అమ్మా! అటులైన బ్రహ్మచర్యము నవలంబించి మోక్షమును సాధింపఁ బ్రయత్నింపుము.

ప్రేమ—బాగుగ నున్నది విశారదా! నీ కొఱకై నేను బ్రహ్మచర్యము నవలంబించి సన్యాసినులలోఁ గలిసిన, నీవు వేఱొక కాంతామణితో నాకు భిక్ష గావింతువు గాఁబోలు.

విశా—దేవి. అట్లైన్నటికిని గాదు. మీా కాపద్ధతి నే నేలఁ దెలిపితి ననఁగా.

ఉ. నే నినుఁ గోరఁగాఁ దగదు
నీ వటె నేరినిఁ గోర నన్నచోఁ
బూనిన బ్రహ్మచర్యమునుఁ
బుణ్య మదెంతయొఁ గల్గునమ్మ ! నా
మానస మైన నీవుఁ గను
మా, నను మాటనుఁ దప్పఁ జాల, నే
బూనితి బ్రహ్మచర్య మిదె
పుణ్యచరిత్రరో ! యింత చాలదే. ౩౦

ప్రేమ—(నవ్వుచు) అటులైన సమ్మతమే. విశారదా! ఇరువురమును యోగినీ యోగులమై యొక్క మఠముననె యుందము.

విశా—(విసుగుచే) ఏమిటమ్మా! ఆ మాటలను వదలి వేయుము. నీ కొఱకై నే బ్రహ్మచర్యమును బూనితినే చాలదా ?

ప్రేమ— ఇదేమి విశారదా! మన్మథ సామ్రాజ్యము నందలి యుద్యాన వన వాటికలఁ బుష్పలతా గృహముల మధ్య పూసజ్జలపై హాయిగ మందమారుతము వీచుచుండ బహువిధ పక్షి సంతాన శృంగార రవముల విని యానందించుచు, మదన కేళీ విలాసమున నోలలాడి నిన్నుఁ ముందిడుకొని నన్ననవరత మేఁచుచున్న యా దుష్ట పంచబాణుని త్రుళ్ళడంచి నా కసి దీర్చుకొనక ముందే సన్యాసులలోఁ గలియ వలె నందువు. ఆవయస్సు వచ్చినపు డటులనే చేయుదము. కాదందునా—రమ్ము పోదము. (అని చేయిఁ బట్టఁ బోవును.)

విశా—నే రాను. నన్నింకఁ దొందరఁ జేసిన (అర్థోక్తి)

ప్రేమ—మనోహరా! నా మాట వినవా? ఇంత బ్రతిమాలినను నీకుఁ గనికరము కలుగదా ?

మ. ప్రియుఁడా ! నాదు సురూప సంపదల సం
ప్రీతిఁ దగం గూర్చ, ని
ర్భయతఁ నన్నిటు స్వీకరింపక యె నం
శాలింపకే కూడి దు
ర్జయ సౌఖ్యాంబుధి నోలలాడకయ చే
రఁ రాకు పొమ్మంటివే ?
భయమా ! సిగ్గ !! విచారమా !!! చెప్పుము నా
ప్రాణేశ్వరా ! వేఁడెదఁ.— 3 ౨

విశా—అమ్మా ! నీ యీ మాటలు నా దృఢ మానసమును ద్రిప్పఁ జాలవు. వృథా ఆయాస పడకుము. నా చేతనగు కార్యమును జేసితిని. ప్రొద్దు పోయినది నేఁ బోయెద (అని పోఁ బ్రయత్నించును.)

ప్రేమ—(దుఃఖముతో) నన్నొంటరిగ విడచి పోయెదవా ? విశారదా! ఇంతయేనా. నామాట వినవా ? పోదువా ? పోయెదవా ! నా గతి యింతయేనా ?—హా ! హాతోస్మి !! హాతోస్మి !!! (అని సోఫాపై మూర్ఛిల్లును.)

విశా—ఆ—ఆ—అయ్యో ! (అని పట్టుకొని) ఔరా! ఈ కుసుమ కోమలగాత్రి యెంతటి పాటు పడెను. ఇన్నిటికిని నీ నిర్భాగ్యుఁడగు నీ విశారదుఁడు కదా కారణ భూతుఁడు. లోకరక్షకా ! నన్నుఁ బుట్టింపకయో లేక పుట్టినప్పుడె మ్రందింపకయు యేల జీవింపఁ జేసితివి. అకటా ! నే నేమి చేయుదును. (అని ముఖమును జూచుచుఁ జేతిగుడ్డతో విసరు చుండును )

ప్రేమ—(మెల్లఁగఁ గన్నులఁ దెఱచి) మోహనాంగా ! ఇప్పటికి దయ కలిగినదా. ఇదే నా నమస్కారము. (అని నమస్కరించును.)

విశా—(దూరమేగి ఆశ్చర్యమున) ఔరా!—అమ్మా! మీరు మూర్ఛనొంది యుండ నుపచారము సేయుచుంటి నంతియే.

ప్రేమ—(మెల్లఁగ లేచి చీర సవరించుకొనుట నభినయించుచు) అయిన నా కోర్కెఁ దీర్పవా?

విశా—ఆ మాటకుఁ బ్రత్యుత్తర మెప్పుడో యిచ్చితిని. పలుమారులు లడుగకుఁడు.

ప్రేమ—(స్వగతమున) ఇఁక నాకు దండోపాయమే శరణ్యము. (కోపమునఁ బ్రకాశముగా) విశారదా! నా రహస్య మంతయు వెల్లడించినను సమ్మతింపవా? నా మాట వినవా? వినకున్న నీగతి యేమగునో తెలియునా? నీపై లేని నిందలఁ గల్పించి ఘోర మరణముల పాలుఁ గావింతును సుమా. విశారదా! బాగుగ యోజించుకొనుము.

విశా—యోజింప వలసిన పనిలేదు. నీ యిష్టము వచ్చిన భంగిని జేయ వచ్చును.

ప్రేమ—విశారదా! (వ్రేలితోఁ బెదరించుచు) చూడుము. ఇఁక జమీందారుకడఁ గపట మోహము నభినయించి నమ్మించి నీ యసువులఁ గొందు సుమా.

సీ. నా యాజ్ఞఁ దలఁ దాల్చి ♦ న్యాయ మన్యాయంబె
యను జమీందారు నీ ♦ వరయ వోయ్
అట్టి గీటును గీచి ♦ అది దాఁట రాదంచు
నే నానఁ బెట్టఁ దా ♦ నిలువఁ డోయ్
కామాంధుఁడయ్యు నా ♦ కాంత బట్టె నటంచుఁ
జెప్పు మన్నంతఁ దాఁ ♦ జెప్పఁ డోయ్
అధికారులకుఁ జెప్పి ♦ యభియోగమును దెచ్చి
చంపు నట్టులఁ జేయఁ ♦ జాలఁ డోయ్

తే. గీ. విను విశారద! నా పల్కు ♦ వినక యున్న
నీదు ప్రాణాలు నీలోన ♦ నిలువఁ బోవు
తప్పు మాటలఁ జెప్పనే ♦ నెప్పు డేని
బ్రతికి యుండిన శుభములఁ ♦ బడయఁ గలవు. 33

విశా—(నవ్వుచు) అంతియే గదా? పిచ్చి తల్లీ!

సీ. కర చరణంబుల ♦ ఖండింపఁ జేసిన
దానికే నిసుమంత ♦ కనల నమ్మ!
కాల్చిన కడ్డీలఁ ♦ గన్నుల రెంటినిఁ
బొడిపింతు నన్న నేఁ ♦ బొగల నమ్మ!
తల క్రిందుగాఁ జేసి ♦ తరువునఁ దగిలించి
చర్మము నొలిచిన ♦ జడియ నమ్మ!
దినమొక యంగంబు ♦ తెగ వ్రేయు చుండిన
నిది యొక విధియని ♦ యెంతు నమ్మ!
తే. గీ. ఇదియు నదియని పేర్కొన ♦ నేటి కమ్మ!
కోటి కష్టములను బెట్టి ♦ కొఱత వేసి
చంపినను నవ్వు ముఖమునఁ ♦ జత్తు, దీని
నుడువ మూఁడవ వానికి ♦ జడియ కమ్మ!— 34

ప్రేమ—(నవ్వుచు) హృదయేశ్వరా! ఊరక భయపెట్టితిని. నీపై నీఁగ వ్రాలిన నే నోర్వఁ గలనా. మనకుఁ దప్పదు. రమ్ము శయన గృహమునకు (అని లాగి బలవంతముగ లోనికిఁ) గొని పోవును)

విశా—(విడిపించుకొని యొగర్చుచు లోపలనుండి పరుగెత్తి వచ్చుట నభినయించి) ఔరా! ఈమె సాహసము (అర్ధోక్తి)

ప్రేమ—(లోపల నుండి పరుగెత్తుకొని వచ్చి మరలఁ బట్టుకొని) ఎక్కడికిఁ బోయెదవు. నినుఁ బోనిత్తునా.

విశా—ఆ—ఆ—(అని త్రోసి పరుగిడును.)

ప్రేమ— హా! ఘోరము!! ఘోరము!!! (అని సోఫాపైఁ బడును)

[యవనిక పడును.]

---

## షష్ఠమ రంగకము.



సమయము :—పగలు ఒంటి గంట

స్థలము :—రాజ వీథి

భువన మోహనరావు విందు నుండి ప్రేమ కుమారి భవనమున కేగుచు దారిలోఁ దనలో తాను మాటాడు కొనుచుఁ బోవు చుండును—

భువ—నేఁడు విందునఁ గొంత యాలస్యమాయెను. మందిరమున కేగి, కొంత విశ్రమించి ప్రేమ కుమారి భవనమున కేగవలయును. ప్రేమ కుమారి చెప్పినటుల వ్రతనియమము ముగిసినది కదా. ఇఁకనైన నా మనోభీష్టమును నెరవేర్పదా? (అని కొంచెము ముందునకుఁ బోవును.

ప్రవేశము :—విశారదుఁడు.

విశా—(ఒగర్చుచు వెనుకనుండి త్వరితముగ భువన మోహన రావునుఁ గూడఁ జూడకుండఁ బోవును.

భువ—(భువన మోహనరావు తిరిగి చూచి ఆశ్చర్యము నభినయించి) ఏమిది. వింతగ నున్నది. మా విశారదుఁడు నన్ను సహితము గమనించక, యొగర్చుచుఁ ద్వరిత గతిని నేగెను. ఎచటి కేగి యుండును? వగర్చుటకు గతంబేమి? ప్రేమ కుమారికి వీణ నేర్పుటకేగి యుండునా? అచటికిఁ బోయియుండిన వాడిటు లొగర్చుచుఁ బోనేల? ఇది వీణాపాఠము నేర్పు సమయము కాదే. (యోజించి) ఊఁ—కానీ—ప్రేమ కుమారి కడకేగిన అన్నియుఁ దెలియఁ గలవు. (అని వెళ్లును.)

ఇది తృతీయాంకము.

---

# ప్రే మ కు మా రి.



## చ తు ర్థాం క ము.

ప్రథమ రంగము.

స్థలము :—ప్రేమ కుమారి మందిరము.

సమయము :—పగలు రెండు గంటలు.—

ప్రేమకుమారి సోఫాపైనుండి లేచి కూర్చుండి దుఃఖ క్రోధాన్వితయై యుండును.

ప్రేమ—(ఉస్సురు మని నిట్టూర్పు విడచి) అకటా! ఎంత పని యాయెను. తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచు ననుట నిజ మయ్యెనే. (అని లేచి) హా!—

ఉ. నాదు మనోహరుండనుచు
నా హృదయేశ్వరుఁడౌ నటంచు నా
మీఁద దయా కటాక్షమును
ప్రేమయు నిల్పఁ గలాఁడటంచు తా
మోదముతోడ బొంది మఱి
పూవిలుకాని జయించు నంచు నే
నాదు మనంబునన్ దలఁచి
నాదు రహస్యము లెల్లఁ బాడితిన్.— 38

(కూర్చుండి) విశారదుఁడీ సంగతి తన మిత్రునితో నసకుండునా. అకటా! ఈ ప్రేమ కుమారి కడకవమానముల వాఁతఁ బడవలసి వచ్చెను గదా. నే భరింపఁ జాల—ఊహూ—నే నీ యవమానమును

భరింపఁ జాల. గౌరవములఁ బోఁగొట్టుకొని జీవించుటకంటె జీవములఁ బాయుటయే లెస్స. నన్నింత గాసి పెట్టిన యీ దుర్మదాంధుని మన నిత్తునా. వాఁ డీయూర నున్నాఁడని విని సహింపఁ గలనా. ఆతఁడిఁక నా నికేతనమునకు రాఁడు.—ఆ సంగతి జమీందారునకుఁ దెలియక పోదు. అదియుఁ గాక యున్నటులుండి వీణాపాఠము నేల చాలించితి వని జమీందారు ప్రశ్నించిన నే నేమని ప్రత్యుత్తర మీయ వలయును. నేఁ గోరి రప్పించిన వానిని నే నే యింత త్వరలో వలదంటినన్న నమ్మునా? (యోజించి) ఒక వేళ నమ్మినను వాని ముఖమును వీక్షించు టెట్లు? ఛీ—వానిని బ్రతుకనియ్య రాదు. నన్నిన్ని కష్టముల వాఁతఁ బడ వేసిన నీచాతి నీచుని నీ ప్రేమ కుమారి యూరక వదల నేరదు.

ఓరీ! విశారదా! నీవు పురుష సింహుఁడవని నమ్మి నీ సౌందర్య మును గాంచి మోసపోయి మోహించితిని గాని; పురుష రూపమున నుండు తోలు విగ్రహమవని గ్రహించనైతిని. పుంస్త్వముగల రసి కావతంసమవని భావించితిని కాని నపుంస కాధముఁడవని మది నెంచ నైతిని. అయ్యో! నా త్రిజగన్మోహనా కారమును జూచియు, నా హృదయ పూర్వక నిష్కళంక నిశ్చయ ప్రేమాను రాగముల బాగుగ నెఱింగియు, నన్నుఁ బ్రేమించిన నీకు లభింపఁగల భోగ భాగ్యములఁ దెలిసి కొనియు, నే నెంత బ్రతిమాలినను, ఎన్ని పెట్ట రాని యాసలఁ బెట్టినను, ఎన్ని విధముల నా నిశ్చితాభిప్రాయములను వెల్లడించినను, కడకు మా జాతికుండు సహజ గంభీర గుణముల వమ్మొన రించి బలవంతమునఁ బైకొని వేఁడు కొన్నను, నిర్దయ వహించి నన్ను నిరాకరించి, తృణమునకంటె హీనముగఁ జూచి పడఁద్రోసి పరుగెత్తి పోయితివి కదా. అకటకటా! నా సౌందర్యమును నీటఁ గలిపి, నా దృఢమగు ప్రేమను భగ్న మొనరించి, నా మోహమును అడవిని గాయు వెన్నెల చందము గావించి, నా కుసుమకోమల హృద యమును జించి నా జీవితమును నాకు విషతుల్య మొనరించి పోయి తివే?—అయ్యో—ఇఁక నేను బ్రతికిన నేమి చచ్చిన నేమి. బ్రతికి

యుఁ జచ్చిన దానవే (ఉస్సురుమని) హతవిధీ!—ఓ సౌందర్యమా! నీ విఁక నన్ను విడచి పొమ్ము. నాకడ నీకుఁ జోటు లేదు—లేదు—ముమ్మాటికి—ఊహు—లేదు. ఓ విశారదునిపై నుండెడి నిర్మల ప్రేమయుత మోహమా! నను వీడి నే యన్యోన్యాను రాగమున హంసతూలికా తల్పములపై మన్మథకేళీ విలాసమున నోలలాడు యౌవన దంపతులఁ జేరుము. ఓ కుసుమకోమల హృదయమా! వజ్ర హృదయమవై క్రోధ ద్వేషములకుఁ జోటొసంగుము. ఓ దుష్ట విశారదా! ఈ ప్రేమ కుమారిని-ప్రేమకు మారి నొనరించితివి. ఇఁక నిన్నుఁ బ్రేమించుటకు మాఱు మహా ఘోర భయంకర శక్తి స్వరూపముఁ దాల్చి నిన్ను నిట్టనిలువునకు దిగమ్రింగఁ బొంచియున్నది సుమా! జాగ్రత!! జాగ్రత!!! నే నేమియుఁ జేయఁ జాలనని భావించితివా? నా మాట నమ్మరనియుఁ నీవే సత్య హరిశ్చంద్రుఁడవనియుఁ దలఁచితివా? నీ మాటయే వేదమంత్ర మను కొందురని భావించితివి కాఁబోలు. ఆ దినములు గడచినవి. ఇవి ప్రేమకుమారి దినములు సుమా.

క. గానవిశారద నీ విఁకఁ
గానఁ బడవు చూడు మింకఁ ♦ గాఠిన్యముచేఁ
బూని వధింపఁగ జేసెద
మానక నీ తండ్రి తోనె ♦ మహిఁ లేకుండఁ. 3౬

ఇదియే నా ఘోర ప్రతిజ్ఞ (యోజించి) అకటా! విశారదుని నే నెంతగఁ దూలనాడితిని. నా ప్రియుఁడు జీవించియుండ దూరము నుండి యైన నతనినిఁజూచి తృప్తిఁ జెంది జీవించెదగాక. ఇఁక అతఁడు నా సదనమునకు రాఁడు. అయ్యో ఎంత జేసితిని. ఆయాసముగ నున్నది. విశ్రమించెద (అని పరుండి లేచి) ఛీ-నాకిఁక మెత్తలతోడను సోఫాలతోడను బనిలేదు. (అని క్రిందఁబరుండును.)

ప్రవేశము:—భువనమోహనరావు.

భువ—ఔరా! ప్రేమ కుమారి ఈ రీతిఁ బరుండుటకు గారణ మేమి?

వ్రతదీక్ష ముగిసినది గదా యనునాసతో వచ్చితిని. (సమీపించి) ఏలకో ఇటులఁబడియున్నది. సమీపించి హెచ్చరించెద గాక (అని పోబోయి.) ఏమనునో. ఔరా!

సీ. చందురులో మైల ♦ జలజంబులో దువ్వ
యూడ్చి పోఁద్రోసి రెం ♦ డొకటి సేసి
అరుణాశ్మ కాఠిన్య ♦ మమృత పాండు గుణంబు
నుడిగించి యారెంటి ♦ నొకటి సేసి
అరులజో డెడయించి ♦ గిరుల ప్రతాపంబు
పెకలించి యారెంటి ♦ నొకటి సేసి
యిభతుండ చాంచల్య ♦ మిల నసంటుల జాడ్య
మొడిచి యారెంటిఁ దా ♦ నొకటి సేసి

(స. వేం. నా. మహాకవి)

తే. గీ. కులుకు నెమ్మోము కెమ్మోవి ♦ కుచయుగంబు
లరిది యూరులు నిర్మించి ♦ యబ్జభవుఁడుఁ
గూర్మి ప్రేమ కుమారిని ♦ గూర్చె నాకు
పూర్వ సుకృతంబు నాయందుఁ ♦ బొసఁగుకతన.-32

(మదీయము)

ఔరా! ఇదేమి—(అని ప్రక్కలఁ జూచుచు) ఇటులగుటకుఁ గారణమేమి? ఇటు లెవరొనరించి యుందురు. ఆ—ఆ—ఇంట నెవరును లేరా? ఎవరు లోపల (అని పిల్చి నిరుత్తరుఁడై) ప్రేమ కుమారీ! (సమీపించును.)

ప్రేమ—(పలుకకుండును.)

భువ—(తాఁక బోయి) స్పృశించిన నేమనునో. ప్రేమ కుమారీ! అయ్యో. ఏమి యిటులఁ బడియుంటివి.

సీ. పూర్ణేందు బింబంబుఁ ♦ బోలు నీ నెమ్మోము
వనజాక్షి! యెవ్వఁడు ♦ వాఁడఁ జేసె?

నీ చీకటులఁ బోలు ♦ నెఱివెండ్రుకలనిట్లు
చేడె! యే యర్థముండు ♦ జిక్కుఁ బఱచె?
బొంగరముల మించి ♦ పొంగు నీ స్థనయుగ
కంచుక మీభంగి ♦ కదలనేల
స్వర్ణకాంతులఁ గేరు ♦ చక్కని దేహంబు
భామ యే దుర్జాతి ♦ భంగ పఱచె?

తే. గీ. ముసుఁగు ధరియించి యీ రీతి ♦ మూల్గ నేల?
నేలపైఁబడి దొర్లగా ♦ నీవ దేల?
కరుణతోఁ జెప్పి నన్నిష్ట ♦ గావు మబల!
చెప్ప కున్నను నా యాన ♦ చెప్ప వలయు.— ౩౭

(కోపమున)

మ. వనితా! తెల్పు మదెవ్వఁడా ఖలుఁడు, ని
ర్భాగ్యుండు చండాలు, నే
మనసీఁ జాలను వాని నీ భువిని నా
భార్యన్ నినుం బట్టి నాఁ
డన నే నోర్వఁగఁ జాల; నేల నిఁక నీ
వాలస్యముం జేయఁగన్
విను వాఁడెంతటి యాప్తుఁడైనను సరే
వీడ్కొల్పి ఖండించెదన్.— ౩౮

ప్రేమ—(ముసుఁగుదీయక నె) ఎందులకన్ని మాటలు - ఇది వృద్ధునికి భార్య ననిపించుకొన్న దానిఫలము. నన్నిపుడు మాటాడింప వలదు.

భువ—(స్వగతము) ఇప్పటికి విశదమాయెను. బహుశా విశారదుఁడు ప్రేమ కుమారిని బరాభవించియుండును. లేకున్నవాఁడు అంత తొందరగఁ బోవుచు వగరింపనేల. ప్రేమ కుమారిని బల వంత మొనరించియుండును. ఆమె సమ్మతింపకుండిన యిరువురు

బోరాడియుందురు. అందులకే వాఁడొగర్చుచుఁ బోయెను. ఔరా! విశారదా! ఎంత జేసితివిరా! నినుఁబెంచి పెద్దజేసి, విద్యాధనంబులఁ గూర్చినందులకు మంచి బహుమాన మొనరించితివి. ఛీ—ఇఁక నినుఁ జూడరాదు. (యోజించి) సరి. వీనిపై అభియోగమును దెచ్చి, నా మిత్రుఁడగు రమేశదత్తుతో మాటాడి వానికి మరణదండన విధించులాగు జేసెద. వాని ముఖమును నే జూడఁజాలను. ఇటులఁ జేసిన ప్రేమకుమారి యనుగ్రహమునుఁ గూడఁ బొందవచ్చును. ఈకార్యము ప్రేమకుమారికిఁ దెలియకుండఁ జేసి సెబాస్ అనిపించెద.

(అని నిష్క్రమించును)

---

## ద్వితీయ రంగకము.

స్థలము:—మోహనరావు భవనము.

సమయము:—ఉదయ మేడు గంటలు.

మోహన రావు విశారదుఁడు రానందులకుఁ జింతించు చుండును.

మోహ—(కుర్చీపై గూర్చుండి యోజించు చుండును.)

చ. వలదు విశారదా! చనకు
వారిజ నేత్రల నమ్మ కంచు నేఁ
బలుమఱుఁ జెప్ప వీనియ న
పారపు భక్తిని నేర్పఁ బోయె, నేఁ
బిలువఁగఁ బంప వత్తునని
ప్రీతిని రాఁడిఁట నేమి చేయుదున్
గలత జనించె నా మదినిఁ
గాంచఁగఁ బోయెదనే నె యిప్పుడున్. ౮౦

(అని లోపలకువెళ్లును)

ప్రవేశము :—విశారదుఁడు.

విశా—(వచ్చుచు)

సీ. ప్రేమ కుమారితోఁ ♦ జెలఁగి నా కొనరింపఁ
బటమును మున్నుంచె ♦ పాప నేలఁ?
బంపి నంతనె యామె ♦ భక్తిసక్తి మోహించి
నెమ్మదిఁ బ్రేమను ♦ నిలుప నేల?
నిలిపిననే మాయె ♦ నే దానిఁ దెలియక
విద్యల నార్జింప ♦ వెడల నేల?
వెళ్లినంతనె తండ్రి ♦ వెసనామెఁ బెండ్లాడ
యామె ప్రేమించక ♦ యడల నేల?
తే. గీ. నేను రాగనె వీణెను ♦ నేర్పు మనఁగ
నేను బోనేల? యాయమ్మ ♦ నీతి వీడి
నన్నుఁ బైకొన, వలదన్న ♦ నన్నుఁ బట్టి
యిటులఁ జేయంగ నేల? ని ♦ కేమి యగునొ. ౪౧

నా విధి—(అని తలయూఁచి) మోహనుఁడు నిన్న రాత్రి నన్నేలకో రమ్మని వార్తఁ బంపె. జరిగిన విషయము నా మనంబును గలంచు చుండ రాక పోయితిని. ఇప్పుడితఁడా విషయమును గూర్చి ప్రశ్నించిన నే నేమియుఁ జెప్పరాదు. ఔను. మూఁడవవానికిఁ దెలుపనని కదా యామె కడఁ బల్కితిని. ఆ మాటను దప్పరాదు. (ఇటు నటుఁ జూచి) మిత్రుఁ డెందేగియుండెనో.

పునః ప్రవేశము :——మోహనరావు.

మోహ—(ప్రయాణమై వచ్చుచు విశారదుని చూచి) ఏమి విశారదా! నిన్నుఁ జెప్పి పంపినను రాక పోయితివి. ఏమి. నీ ముఖము కళాహీనమై యున్నది. సరి. కూర్చుండుము.

విశా—(లేని చిఱునవ్వు నభినయించి) ఏమియు లేదు. మా తల్లికి జబ్బు చేసి యుండినందున రాత్రి రాఁజాలక పోయితిని.

మోహ—అటులనా. ఇపు డెటులున్నది.

విశా— బాగుగనే యున్నది.

మోహ—అయిన నిన్నటి విశేషము లేమి?

విశా—ఏమియు లేవే.

మోహ—ఏమియు లేదా?

విశా—లేవు. ఏమోయి.

మోహ—విశారదా! ఏలదాఁచెదవు. నా కన్నియుఁ దెలియును. అన్ని యేల ఈ కాగితమేమో చూడుము. (అని యిచ్చును)

విశా—(చదువుట నభినయించి) బహుశా శారదా పూజలకు నను రాఁగోరి వ్రాసి యుండును.

మోహ—పిచ్చివాఁడా! క్రింది సూచననుఁ జూడుము. ఆది అంత్య వర్ణములఁ జదువుము-తదుపరి మధ్యాక్షరములఁ జేర్చి కొనుము. తెలియును.

విశా—(చదువుకొని పాఱవేయుచు) పిచ్చి తల్లి. తెలియక వ్రాసినది. జరిగిన దానితో మన కేల పోనిమ్ము.

మోహ—అయిన నీ విఁక ఆమె సదనమునకుఁ బోవలదు.

విశా—సరి.

మోహ—అటులైన ఫలహారముఁ జేసి వత్తము రమ్ము (అని పోవుదురు. యవనిక పడును)

---

## తృతీయ రంగకము.

స్థలము :—రాజవీధి.

సమయము :—ఉదయము 8-30 గంటలు.

బుడ్డర్ సాహెబు తన యింటికిఁ బోవుచు
రాత్రి జడ్జి రమేశదత్తుతో భువనమోహనరావు

విశారదునికి మరణదండన విధించు లాగున బోధఁజేసి వెళ్లిన సంగతిని అనుకొనుచు వెళ్లు చుండును.

బుడ్డన్—అరెరెరెరెరే—క్యా అన్యాలం—క్యా అన్యాలం రా—దేముఁడా-న్యాయం-న్యాయం-అంటే యాడావుండాయ్ భా-అంతా అన్యాలం- సబ్ ఝూటా—ఈ కలిగ్గం ఉత్తది—ఖుదానై—ల్యాకపోతే కల్ రాత్రిమే జమీందార్ వాడ్ మెల్లంగ మెల్లంగ (అని అటునిటుఁజూచి) వచ్చి జడ్జి సాబ్‌కీ ఏమేమో మాటల్ చెప్పి విశారద్ మారాజ్ ప్రేమ అమ్మాకీ క్యాక్యాయ్‌కీ బురాకాం చేసినాయ్ కర్కె చెప్పి (వెనుక ముందు చూచి) విశారద్‌పైన కేస్ బనాయిస్తా ఉస్కు గల్లుకీ ఇచ్చే శిక్ష చెప్పాలె అని పూచాహై. వాసీ బాత్ తోసీ యెయ్యాల్యాక జడ్జీసాబ్ అచ్చా అన్నాడు. ఈ పొద్దు విశారద్‌కు పకడ్ జాకో కచేరీమే దరియాఫ్తు చేసి గల్లాకి యిచ్చేలాగ దిస్తావుంది. మైజాకో ఈసంగ్తీ విశారద్ వాడ్కి చెప్పి—ఏ దేశాన్కి ఐనా దౌడ్ అని చెప్తా—(యోజించి) అరే అట్లాచేశాతో—జమీందార్కి మాలూం అయితే నాది పానానికే వస్తాయ్ అరె-పానంపోతే మళ్లా యెట్లా భతికేది-నాది జోరూ-బచ్చే-ఘర్-సామాన్ గీమాన్-ఏమీ కావాలెథే. పిల్లల్ వాడ్కి నాకు యెందుకుబా. కైసాజగ్గాల్నో ఐసాఅయ్‌తాయ్. నాకీ యెందుకు యీ తంటా-ఘుర్కు జాకో సంకటీ తిని మళ్లా కోర్టుకాడా హాజర్ వుండాలె-నైతో-నౌకరీ-(చేయిద్రిప్పుచు) నహీ. (అని కోర్టులో జరుగు అన్యాయములను గురించి పాడుచు వెళ్లును)

(యవనిక లేచును)

---

## చతుర్థరంగకము.



స్థలము :—మోహనరావు గృహము.

సమయము :—ఉదయం 7½ గంటలు.

మోహనరావు విశారదుఁడు గుంటుబల్ల దగ్గఱఁ గూర్చుండి కాఫీ త్రాగుచుందురు—ఒక వెండి పళ్లెరమునఁ బంగ్లుంచును.

విశా—మోహనా! ఏలనో నిద్ర లేచినదాదిగా నావామ నేత్రమదరుచున్నది.

మోహ—వాయువే కారణమై యుండును లె (అర్థోక్తి)

ప్రవేశము :—భయంకర నాయుఁడు.

భయ—(వచ్చుచు) అయ్యా! విశారదా! ఈ పత్రమును జదువుకొని సిద్ధపడుము. (అని యిచ్చును)

మోహ—(ఆశ్చర్యముస)ఆ—ఆ—ఏ మది.

విశా—(కాగితము నందుకొని లేచి)

రక్షక భటాధికారియగు భయంకర నాయునికి.—

"విశారదుఁడు పరస్త్రీని బలవద్గమన మొనరించి హత్యఁ గావించుటకుఁ బ్రయత్నించినట్లు భువన మోహన రాయ బహదర్ వారు అభియోగమును దెచ్చి యున్నారు గాన నీవు తక్షణము విశారదుని బంధితుని గావించుకొని న్యాయస్థానమునకుఁ గొని రావలయును" (అని చదివి) నాయుఁడు గారూ! (నిట్టూర్పు విడచి) సిద్ధముగ నుంటిని. నీ కార్యమును నెఱవేర్పుము.

మోహ—హా! అన్యాయము. అన్యాయము. (అని అడ్డు వచ్చును.)

# చతుర్థాంకము

భయం—అయ్యో! జాగ్రత. దూరము పొమ్ము. (కెలలుఁ దగిలించి) విశారదా! నడువుము.

మోహ—(కన్నుల నీరుఁ దుడుచు కొనుచు) విశారదా! భయపడకుము. న్యాయస్థానమునకు వచ్చి సత్యమును రుజువు పఱచి నిన్నుఁ దప్పించెద.

విశా—(మెల్లగ విశారదుఁడేగుచుండ భయంకరనాయుఁడు వెంబడించును.)

మోహ—(అటులనె జూడ్కుల నిగిడించి) ఔరా!

విశా—(వెనుకకుఁదిరిగి) మిత్రమా! నేనొక కోర్కెఁ గోరెదను. దానిని దీర్తువు కదా?

మోహ—అయ్యో! నీవు గోరుటయు నేఁ జేయకుండుటయు నా? చెప్పుము.

భయం—అయ్యో! అదే మొత్తొందరగఁ గానింపు.

విశా—(భయంకర నాయునితో) అయ్యా! దయయుంచి రెండు నిమిషము లాగుము. (మోహనరావుతో) మనముఁ జేతిలోఁ జేయి వేయుము.

మోహ—సరి. (అని చేయి వేయును)

విశా—(మోహనరావు చెవిలో రహస్యముగఁ గొన్ని మాటలఁ జెప్పి భయంకర నాయునితో) అయ్యా! ఇఁక నడువుఁడు.

మోహ—అయ్యో! విశారదా! నన్ను మోసగించితివి. అయ్యో! ఆ సంగతుల వెల్లడించుటకు అనుజ్ఞనిమ్ము. అన్యాయముగఁ జెడెదవు.

విశా—నే నీయను. (అని విశారదుఁడు ముందేగుచుండ భయంకర నాయుఁడు వెనుకఁ బోవుచుండును.)

మోహ—విశారదా! విశారదా! ఆజ్ఞనొసఁగుము. నీ పుణ్యమగును.
(అని వెంబడింపఁ బోవ)

భయం—అయ్యా! ఆగుఁడు. మావెంట రాఁగూడదు.

మోహ—హా!

ఉ. న్యాయము న్యాయ మంచు జను
లాడుచు నుందురు. వట్టిమాట యఁ
న్యాయమె న్యాయమయ్యెఁ గద
యార్యుల మాటలఁ బొల్లొనర్పఁగా
మాయురె! దీని నమ్మి యిఁక
మామక మిత్రుని నే మొనర్తురో
న్యాయముఁ జాటఁగా వలయు
నార్యులు మెచ్చఁగ నేను నిప్పుడే.— ౪౨

# ప్రేమ కుమారి.



## పంచమాంకము.

### ప్రథమ రంగకము.

స్థలము :—ప్రేమ కుమారి మందిరము.

సమయము :—సాయం సమయము.

ప్రేమ కుమారి తన శయన గృహమున సోఫా పైఁ గూర్చుండి విశారదుని చిత్తరువును ప్రక్క నిడుకొని తన విచారమును వెలిబుచ్చు చుండును.

ప్రేమ—(సోఫా మీఁదఁ గూర్చుండి యెడమ చేతఁ జిత్తరువును గ్రహించి చూచుచు.)

ఉ. వేళ యెఱింగి కూడి రతి
భేదములన్ దనియించి యల్గినన్
బాలిని బుజ్జగించి రస
భావములన్ గఱఁగించు నాయకుం
డేల యదృష్ట హీనలగు
నింతులకున్ లభియించు; లేనిచో
(స. వేం. కృ. నా. కవి)
నేల విశారదుండు నను
నేలక నిర్దయుఁ బోవు నీగతిన్ ౮౩
(మదీయము)

(పటమును ప్రక్కనిడి) ఔను. హా—(నిట్టూర్పు విడచి) కేవలము ధర్మమార్గ ప్రవర్తనా నిమగ్నుఁడగు విశారదుఁడు నన్నుఁ దిర

స్కరించి చనినను, నే నాతని నిశ్చల స్వభావమునకు సంతసించి నా కాతని పొత్తు ప్రాప్తిలేదని యూరకుందమన్న నాచేతఁ గాకున్న దే (తలయూఁచి) ఏమి యీ త్రిజగన్మోహనాకారుని విలాసము. (తల నాడించి మెచ్చుచు) సెబాస్! భువిపై జన్మించి నందులకు.

సీ. మోహనాంగా! నీదు ♦ మోముఁ జూచిన నింక
సొగసగుఁ జంద్రునిఁ ♦ జూడ నేల?
మదన సమాన! నీ ♦ యధర మానిన నింక
యమృతంబు నొకరినే ♦ నడుగ నేల?
సన్నుతాంగా! నీదు ♦ చాయ సోఁకిన నింక
స్వర్ణాభిషేకంబు ♦ వాంచ యేల?
సుందరాకార! నీ ♦ సురత మబ్బిన నింక
నాక సుఖంబుల ♦ నరయ నేల?

తే. గీ. మదన కళలను మెప్పించి ♦ మమతఁ దీర్చి
రమణ నన్నెటు మదన సా ♦ మ్రాజ్యమునకుఁ
"చక్రవర్తిని" నొనరించి ♦ "చక్రవర్తి"
వగుదు వనుకొంటి యిఁటులౌట ♦ నరయ నైతి. ౪౪

ఔరా! ఇఁక నాకెక్కడి సంతోషము? ఎక్కడి తృప్తి. అబ్బా!—ఉస్సు—వానికిని నాకును మొన్ననె దూరమై పోయెను. ఈ నా మనోవేదనను—ఈ హృదయాంతరాళమున జాజ్జ్వల్యమానమై ప్రజ్వరిల్లు ఘోర శోక దవానలమును జల్లార్చు టెట్లు. అయ్యో! పాపి ప్రేమకుమారీ! ఇపుడేమనుభవింపఁ గలవు. ఇఁక నీ కీ మనోదుఃఖము వలని మరణము తప్పదు సుమా. (మరలఁ జిత్తరువును గొని చూచుచు) విశారదా! అన్యభామినులను మాతృ సమానలగను పరధనములఁ జిల్ల పెంకు లీలనుఁ బరిగణించు మహా సౌజన్యనిధి యెవరన ముందు నిన్నుఁ జూపి మీఁద నితరులఁ జూప వలయును. సత్యధర్మములకై తన ప్రాణములఁ దృణప్రాయముగ నెంచి సంతోష పూర్వకముగ నొసంగు ధీర శిఖామణి యెవ్వరన నిన్నుఁ బేర్కొని యితరులఁ బేర్కొన వలయు.

సకల సంపద్యుక్తముగ నీ మహా ప్రపంచమున కేక ఛత్రాధిపతిని జేయుదు మని వేయివిధముల బ్రతిమాలి కోటి యాసలఁ గల్పించినను ధర్మ మార్గమును వీడని నిశ్చల శాంత సత్య ధీర ఘంభీర పురుష సింహ మెవ్వరనిన నీ నామము నుచ్చరించి పిదప నితర పేరులఁ బిలువ వలయు. శ్రీరామచంద్రునకుఁ బిదప—సత్య హరిశ్చంద్రునఁ కీవల—పాండవుల యనంతరము— శ్రీ శివాజికిఁ బిమ్మటఁ—నీవే నిక్కువ మగు భారత కుమారుఁడవు. అయ్యో! అట్టి సుగుణనిధిని—అట్టి ప్రతిభా శాలిని—అట్టి జితేంద్రియ విశారదుని నొప్పించి రాకుండ జేసికొంటినే. (పటమును జూచుచు) విశారదా! ఓ విశారదా!! ఓ నా ప్రియ విశారదా!!!—పలుకవా—ఇంతయేనా—అయ్యో! నన్ను మహా దుఃఖసాగరమున ముంచి పోయితివా? నే నీ ప్రపంచమున నీతో సుఖ మనుభవించుటకు నోఁచు కొనక పోయినను స్వర్గమున నైన నీతో సుఖించుటకు రాక మానుదునా. నా చంద్రాయుధమే నాకు శరణ్యము. విశారదా! కడసారినైనఁ బలుకరాదా? (ముద్దిడి) మారు ముద్దుఁ గొనవా? అయ్యో! ఇంతయేనా? విశారదా! విశారదా!! విశారదా!!! హా!—(అని సోఫాపై వ్రాలును.)

ప్రవేశము :— హేమ.

హేమ—(తొందర నభినయించుచు) అమ్మా! అమ్మా! విశారదు నకు మరణ దండన విధించి యున్నారఁట.

ప్రేమ—(ఉలికి పడిలేచి తొందరతో) ఆ—ఆ—విశారదునికా—శిక్షా—ఏల—ఎవరు చెప్పిరి—ఎందులకు—ఏ నేర మొనర్చి నాడని—(అర్ధోక్తి.)

హేమ—మీపై బలవద్గమన మొనరించి నాడని బమీందారుగారు అభియోగమును దెచ్చి జడ్జిగారిచే మరణ దండన విధించునట్లుఁ జేసెనఁట. వధ్యస్థలమునకుఁ గొనిపోయి నారఁట.

ప్రేమ—ఔరా! పాపి భువనమోహనా! ఎంతఁ జేసితివి. నా విశా రదుని లేకుండఁ జేసెదవా? నీ చేతనగునా. నా విశారదుని

నేఁ దప్పించుకొని వచ్చెదగాక. (అని ఎక్కడి వస్తువుల నక్కడ బడవైచి చెదరిన చీర వెంట్రుక కలతోడనే అడవికిఁ బరుగిడును.)

హేమ—(భయమున) అయ్యో! (అని పోవును)

యవనిక పడును.

---

## ద్వితీయ రంగకము.

స్థలము :—రాజమార్గము.

సమయము :—పగలు 3 గంటలు.

మోహనరావు పిచ్చివాఁడై, తనలో తానె మాటాడుకొనుచు, చేతులఁద్రిప్పుచు-నవ్వుచు-వచ్చును.

మోహ—ఇదిగో జాబు—(అని చూపి) అయ్యో! విశారదుఁడు చూప వలదనెను గదా. అయ్యో! చూపితినే (అని ప్రక్కలఁ జూచి) ఎవరును లేరు (మరలదాచి) అదిగో ప్రేమకుమారి—విశారదా! రమ్ము. సత్యమును వెల్లడి చేయనియ్యక చనిపోవు చుంటివే—అయ్యో! నే నిన్ను వదలఁజాల—(నవ్వుచు) ఓరి భువనమోహనా! ప్రేమకుమారి నిన్నుఁ బ్రేమించు నను కొంటివా? (చేయిఁజుట్టుచు) ఇదిగో పెద్ద సున్నయే.

విశారదా! కోర్టులో వాదించ వలదని చెప్పితివే—నేను నీ మాట వినను—ఇదిగో పోయి నిజమును వెల్లడించి నినుఁగాపాడెద. నీ చేవ్రాల కాగితము నుపయోగింపవల దంటివే (నిదానించి) ఇంకెక్కడి కోర్టు—అంతయు ముగిసిపోయెను. (ప్రొద్దునుజూచి) అయ్యోప్రొద్దు పోయెను—విశారదుని అడవికిఁ గొంపోయి యుందురు. ఆహా! నా మిత్రుఁడే లేకున్న నే నెందులకు.

అదిగో—అదిగో—ప్రేమకు మారీ! రావలదు—రావలదు. నీవు ప్రేమకుమారివి కాదు—ప్రేమకు మారివి—కాదు—కాదు—ప్రేమకు మారిది తప్పు కాదు—జమీందారుదే తప్పు-విశారదునిఁ జూడఁబోయెద—అరణ్యము—అరణ్యము—ఎక్కడ—అదిగో-అదిగో- విశారదా! వచ్చితి-వచ్చితి-(అని పరుగిడును.)

---

## తృతీయ రంగము.

స్థలము :—అరణ్య ప్రదేశము.

సమయము :—సాయంకాలము నాలుగు గంటలు.

విశారదుఁడు దూరమున నిలిచి కరముల ముకుళించి భగవంతునిఁ గూర్చి ప్రార్థించు పాటను బాడుచుండ భయంకరి నాయకుఁడు కొంత దూరమునకుఁ బోయి నిలిచి యుండును.

విశా—(పాటను జాలించి) సర్వేశ్వరా! ఇదియా నీ న్యాయ పరిపాలనము. (నవ్వుచు) నన్నింత మోసగించుటకు వేఱు విధానము నీకు స్ఫురింపక పోయెనా? స్వాభావికమగు మరణమునకు నే నర్హుఁడను గాననియా? ఈ భరింపరాని యపనిందను నా తలపై నిడి చంపించు చుంటివి. నేను నీ దయాకటాక్షములకుఁ బాత్రుఁడనో కానో యీ మాయా ప్రపంచ మోహముంగఁ జాలక పోయినను, సర్వాంతర్యామివై సర్వమును దిలకించు నీకుఁ దెలియదా? (మరల నవ్వుచు) చావనిన భయపడునో లేదో యని పరీక్షింపఁ దలంచితివా? సర్వమును దెలిసిన నీవును వెఱ్ఱివాఁడ వైతివిగదా యని నాకు నవ్వు వచ్చుచున్నది.

శా. గోత్రారిన్ శరణంబుఁ గోరఁ జనినన్
గోవిందుఁడే వచ్చినన్
పాతాళంబున నుండు గహ్వరములన్
మాటాడకేఁ డాఁగ నే
యే తీర్థంబుల డాఁగినన్ మరణమా
నే యే క్రియన్ జూడఁగా
"జాతస్య స్మరణం ధృవం" బనెడి శా
స్త్రప్రక్రియల్ తప్పునే.— ౧౫

లోకరక్షకా! నే మరణమన్న భయపడు స్వభావముఁ గలవాఁడను గాను కాని యీ లోకాపవాదమునకు భయపడుచున్నాఁడ. నేఁ జచ్చినను నీ యపవాదము మాత్రము స్థిరముగ నుండును గదా? ఇఁక మీఁదట నే దుర్మార్గుఁడైన దుష్కృత్య మొనరించిన నేఁ జేసినను జేయక పోయినను వీఁడు రెండవ విశారదుఁడని నన్నుదాహరణముగ గైకొందురే. (సంకటము నభినయించి) అయ్యో! ఈ యవమానమునకు నేఁ దాళఁ జాల. ఈ కర్ణకఠోరమగు నపనిందను భరింపఁ జాల. అకటా! నా తండ్రి న్యాయస్థానమున నీ యభియోగమును వైచి నన్నవమాన పఱచి తానవమాన పడుటేల. తనకు నాపై నిక్కముగ ననుమానమే యుండిన నన్నుఁ బిలచి "విశారదా! నీవు నాకు ద్రోహ మొనరించితివి, నీ మనుగడ నన్ను చింతార్ణవమున ముంచును, నీవు బ్రతికియుండ నేఁ జూచి సహింపఁ జాల" నన్న వెంటనే మదీయ శిరమును కరవాలమును గైకొని నా చేతులార ఖండించి మా తల్లి ప్రేమకుమారి మృదు పాదసరోజముల మీఁదఁ బడునట్లు చేయక పోయి యుండునా? ఈ మహాకార్యమును న్యాయాధిపతికిఁ దెలుపుటెందులకు? అతఁడు న్యాయమును గనిపెట్టు ననియా? మంచి న్యాయమును గనిపెట్టెను. ఇక్కాలమున న్యాయమును గనిపెట్టఁగల న్యాయమూర్తులును, సత్యమును వెల్లడించు న్యాయ స్థానములును నున్నవా? లేవు. లేవు. ముమ్మాటికిని లేవు. ఉన్నచో నిట్టి యన్యాయపు టుత్తరు

వేల జరించి యుండును. ఇపుడెక్కడి న్యాయము. ఓతల్లీ! న్యాయ దేవతా!

సీ. అర్థాంగనల నీచ ♦ మగా నధరంబాను
భ్రష్టులఁ గని నీవు ♦ పాఱి నావా
తమ్ము బ్రేమింపని ♦ తరుణులఁ దాకొను
నధములఁ గనినంత ♦ యదరి చనితో
పలల సంయుత మధు ♦ పానంబు చేయఁగా
తెగదని కనుఁగొని ♦ తరలి నావా
జేనెడు పొట్టకై ♦ లేని మాటలఁ బల్కు
దుష్టులఁ గనలేక ♦ తొలఁగి చనితొ

తే. గీ. లేని నిందలఁ గల్పింపఁ ♦ బూను కొనెడి
పాపులను గని యడవికిఁ ♦ బాఱి నావొ
భూసురుల కడనైననుఁ ♦ బొసఁగ నీకు
నెలవు లభియింప దాయెనే ♦ తెలుపఁ దల్లి.— ౪౬

ఈసంగతిని బాగుగ నెఱింగియు భారతీయు లవివేకులై న్యాయ స్థానము లందేమో న్యాయము లభించునని తమ కష్టార్జిత విత్త సముదాయమును న్యాయస్థానములయందును న్యాయవాదులకును వ్యర్థ మొనర్చు చుండిరి గదా (యోజించి) ఔరా! ఏమి నా యవివేకము. ఇఁక నిముసమునకుఁ జచ్చెడి నాకీ న్యాయాన్యాయ తర్కమేల? (అని భయంకర నాయుని వైపుఁ జూచి) అయ్యా! నాయుఁడు గారూ!

భ. నా—(యోజించుచుఁ దల వంచుకొని వచ్చును.)

విశా—నన్ను క్షమింప వేఁడుకొనెద. ఏమేమియో యనుకొనుచు మీ కార్యమున కంతరాయ మొనరించితిని. అయ్యా! నేను ప్రార్థించుట ముగించిన తోడనే "ఓం" అని యందును. అప్పుడే మీరు నన్నుఁ గాల్చ వలయును. సంశయింపక ఓం అను శబ్దము విన్న తోడన అనఁగా జెప్ప పాటున మీ ధర్మ

మును నెఱవేర్ప వలయును. నాయుఁడు గారూ! నాయందు దయ యుంచి నా కరములకుఁ దగిలించిన యీ గొలుసును విప్పి స్వేచ్ఛ గలిగించి భగవంతుని బ్రార్థింప నిమ్ము చాలును. ఇదియె నా కడపటి కోరిక. భయపడకుఁడు నేఁ బరుగెత్త ననియుఁ దప్పించు కొనుటకుఁ బ్రయత్నింప ననియుఁ ద్రికరణశుద్ధిగఁ జెప్పుచుంటిని.

భనా—(దుఃఖముతో వెళ్లి గొలుసునుఁ దొలంగించును)

విశా—(కన్నుల మూసికొని ముకుళిత హస్తుఁడై మెల్లఁగ లోనలోఁ బ్రార్థించుట నభినయించును.)

భనా—(యోజించుచు అటు నిటుఁ దిరిగి) ఔరా! ఇట్టి సద్గుణ సంపన్నుని నా చేతులారఁ గాల్చి చంపవలయునా. మొన్న మోహనరావు గారి మందిరమునుండి బంధితు నొనరించుకొని వచ్చిననాఁడు నా హృదయమును పాషాణము నొనరించుకొని నా యంతరాత్మ వలదన్నను నకార్యము నొనరించితిని. అంతటితోఁ బోనీక నేఁడీ మహనీయునిఁ జంపు కృత్యమును గూడ నా తలపై నిడిరి. ఔరా! ఇది నా చేత నగునా? నా వజ్రహృదయ మేలకో దయారసమునకుఁ జోటొసంగెనే.— అకటా! నే నీ కార్యము నాచరింపకున్న నా జీవికకే భంగము వాటిల్లును. సద్గుణ నిధియగు విశారదుని జంపితినా సోదర ద్రోహ మొనర్చిన వాఁడ నగుదును. మే మిరువురమును భారత మాతృగర్భ సంజనితుల మగుటకతన సోదరుల మగుదుము. నా సోదరుని, నాకే గాక మఱియెవరికిని నపచార మొనరింపని విశారదుని నా చేతులారఁ గాల్చి చంపవలయునా? ఛీ! ఈ సేవకా వృత్తిఁ జేయుచుండినందున కదా యీ యన్యాయ కృత్యమునకుఁ బూనుకొన వలసి వచ్చెను. పురమున నాబాల గోపాల మన్యాయ మన్యాయ మని గంట మ్రోఁగినట్లు మ్రోఁగుచుండ న్యాయాధిపతి యెఱింగియు జమీందారు

మాటలకు లొంగి యీ తీర్మానము నొనరించెనే. అకటా! నే నీతనిఁ జంపఁజాల. ఊహు—నే నీ కార్యమును జేయఁ జాల—నిక్కవముగ నే నొనరింపఁ జాలను. ఈ యుద్యోగము లేకున్న వేఱొండు వృత్తి ననలంబించి నా జీవయాత్ర సాగింపఁ జాల (అర్థోక్తి)

విశా—ఓం—(అని యూరకుండును.)

భనా—(ఉలికి పడి చే తుపాకిని బట్టి) ప్రభుత్వమువారి యుప్పు దిని వారియాజ్ఞ పాలింపకున్న నా కంఠమున బ్రాణము లుండునా. ఊ—ఎక్కడి కనికరము—ఎక్కడి దయ. (అని తోటా నెక్కించి పిస్తోలును గుఱిపెట్టును.)

విశా—అయ్యా! త్రుటిలో నీ కార్యమును నిర్వహింపవలెనని ముందే మిమ్ముఁ బ్రార్థించి యుంటిని గదా. ఆలస్యమేల చేయుదురు. ఇప్పుడైనఁ జేయుఁడు. (అని కన్నుల మూసికొని చేతుల జోడించి) ఓం.—(అనును)

భనా—(గుఱి పెట్టి పిస్తోలును బట్టుకొని యుండిన చేయి వడంకు చుండ) ఔరా! నా చేయి వడంకుచున్నది. నా దేహమం తయుఁ జలించుచున్నయది. (తలఁద్రిప్పుచు) కాదు—కాదు—యీ కార్యము నా చేత గాదు. అయ్యా! విశారదా! నే నిన్నుఁ జంపఁ జాల. (అనుచుండ పిస్తోలు, ఎడమ చేతి నుండి రెండు తోటాలు, జారి పడును.)

విశా—(తటాలున పిస్తోలును దీసి కొని) అయ్యా! నీ చేతఁ గాకున్న తొలంగుము. (అని తన చోటున కేగి) ఓం—(అని కాల్చు కొని క్రిందఁ బడును.)

ప్రవేశము-ప్రేమ కుమారి యొక ప్రక్క నుండియు, మోహనరావు రెండవ ప్రక్కనుండియు వత్తురు.—

ప్రేమ—హా! విశారదా! మించెను. మించెను. అయ్యో! ఇం కేది గతి.

మోహ—హా! మిత్రమా! (అని విశారదునిపైఁ బడును)

భనా—(ఆశ్చర్యమున) అయ్యో! ఆ—ఆ—(అని విశారదుని దరికేగి పిస్తోలునకై వంగు చుండ)

ప్రేమ—(కోపమున) ఆ—ఏమది—ఆగుము (అని గద్దించి తానేగి పిస్తులును గైకొని ముందు భయంకర నాయుఁడు క్రింద వదలిన రెండు తోటాలను దడాలునఁ దీసికొని) పొమ్ము—జాగ్రత—

భనా—(మెల్లఁగఁ బోవును)

మోహ—అయ్యో! నా మిత్రుఁడు నాకు లేక పోయె గదా. ఈతని తల్లికీ సంగతిఁ దెలుపఁబోయెద. (అని పోవును)

ప్రేమ—(దుఃఖముతో విశారదుని కడకేగి కూర్చుండ ఇరువురు వచ్చి విశారదుని వశమును గొనిపోదురు.) అకటా! నా మనోహరుఁడు నాకు లేక పోయెనే—(లేచి) అకటా! ఏపాప మెరుంగని విశారదుని కీ గతియా! ఓరి భువనమోహనా! నీవు మానవ మాత్రుఁడవా. కాదు—కాదు—ఓరీ! మదీయ సౌఖ్య సంహారా! నా స్వాతంత్ర్యమును రూపు మాపిన నీచశిఖామణీ! నామనోహరుని—నా హృదయేశ్వరుని—నా ప్రాణ మగు విశారదుని—నా సుహృదయ పూర్వకముగఁ బ్రేమించిన విశారదునిపై నా కుండెడి మోహమును నిర్ధూమ ధామ మొనరించి పుత్ర ద్రోహమునకు వెనుదీయక విశారదుని సొత్తునగు నన్ను మాయోపాయమున నపహరించి నీ దానినిగ నొనర్చు కొనఁ దలఁచిన పాపీ!—దురాత్మా! నా జన్మమును నిరుప యోగ మొనరించితివి.—నా యౌవనమును వృథఁ గావించితివి—నా సౌందర్యమును పాడొనరించితివి. విశారదునిపై నా కుండెడి మోహమును నడవిని గాచిన వెన్నెల నొనరించితివి. ఇఁక నిన్నే మొనరించిన నా కియ్యది లభించును. నా ప్రియ విశారదుఁడు నా కబ్బును. ఔరా! నే మనసారఁ గోరిన వానిని

నేఁ బొందుటకు నోఁచనైతిని గదా. నా కా స్వాతంత్ర్యము లేక పోయెను గదా? పురుషాధములారా! సంఘ నాయకుల మని విఱ్ఱవీఁగు చండాలురలారా! మతాధి కారులమని గర్వించు నీచు లారా! మీ కీ పక్షపాతము తగునా? మానవ మాత్రుల మగు మా కొక చట్టము, మీ కొక చట్టమా? పురుషులు మాత్రము ఏరి కోరి స్త్రీలను వివాహ మాడవచ్చును—స్త్రీలు మాత్రము వృద్ధుఁడుకాని—అవివేకుఁడు కాని—విద్యా విహీనుఁడు కాని—షండుఁడుకాని—మీరుఁ జూపిన వానినిఁ దప్ప తాము మనసారఁ బ్రేమించిన వానినిఁ బరిణయ మాడ రాదా? పురుషుఁడు మాత్రము భార్యలు గతించు చుండ మఱి యొక యువతినిఁ బెండ్లాడి యా స్థానమును నింపు చుండ వచ్చును, స్త్రీలు మాత్రము యౌవనోదయమునకుఁ బూర్వమే మీ కృత్యముల మూలమునఁ బతిని గోలుపోయిన యెడల సర్వ సుఖముల విసర్జించి సన్యాసినులై కటిక నేలపైఁ జిఱుచాప మీఁదఁ బడియుండ వలయును. మీరు గోరిన వృద్ధ వివాహ ములఁ జేయ వచ్చును—బాల్య వివాహముల నాచరింప వచ్చును—బాల విధవా వివాహముల నిరసింప వచ్చును— కాని మీ యకృత్య దోషమునకై స్త్రీసంఘము సౌఖ్య దూరులై నవసి చావవలయు నా? స్త్రీలను బతివ్రతా ధర్మ మున నుండఁ గోరుపురుషులు తా మేకపత్నీ వ్రతము నవలం బింప వలదా? ఆహాఁ—అది మాత్రముకాదు. స్త్రీలది మీ వంటి దేహము కాదా? మీ కుండెడి విషయాసక్తి వారి కుండదా? వారు ఱాతిబొమ్మలా లేక మట్టిప్రతిమలా? కాదు—కాదు.—

సీ. ఆతివలు స్వాతంత్ర్య ♦ మడుగ రాదని తిట్టి
కసరెడి సంఘాధి ♦ కారు లార!

స్త్రీలను విద్యయేఁ ♦ జెఱిపి వేయు నటంచు
నరచెడి యోముస ♦ లమ్మ లార !
బాల్య వివాహముల్ ♦ బాగానె మనశాస్త్ర
ములనైనఁ గనుఁడను ♦ మూర్ఖు లార !
బాల వితంతువుల్ ♦ పరిణయ మాడుట
తగదని గొణఁగెడి ♦ తరుణు లార !

తే. గీ. తగని దాంపత్య ములఁగూర్చు ♦ తండ్రు లార !
భర్త కపకీర్తిఁ దెచ్చెడి ♦ పడఁతు లార !
సంఘ లోపములను దీర్పఁ ♦ జాలకున్న
లేవు సద్గతుల్ స్త్రీలకు ♦ లేవు లేవు.— ౪౨

కనుక నేను మీ సంఘ చట్టములను ధిక్కరించి నా స్వధర్మమును— నా స్వాతంత్ర్యమును నిలుపఁ గోరి—నా సమ్మతిని బడయకఁ జేసిన పరిణయమునుఁ బోఁద్రోసి నే ప్రథమ వీక్షణమునఁ ప్రేమించిన విశారదుని మోహించితిని. నా పాతివ్రత్యమును గాపాడుకొంటిని. నా విశారదునిఁ బొందఁ గోరితిని. అంతియే కాని నే నధర్మమాచరించి యుండ లేను. అయిన నా కోర్కె నెఱవేర్చుకొనఁ జాలక పోయితినని యందురా? ఇచట నెఱవేర్చుకొనఁ జాలక పోయినను పరలోకమునఁ జేరి నా కోర్కెని కొనసాగించుకొందును (అని పిస్తోలునకు తోటా నెక్కించుట నభినయించి) నా విశారదుఁడే మరణింప నే జీవింపఁ గలనా. (అని కాల్చుకొనఁ బోయి మరల యెత్తిన చేతిని దించి) ఊహు—నేనూరక మరణించినఁ ప్రయోజనము లేదు. (యోజించి) సరి—(అని నిష్క్రమించును.)

యవనిక పడును.

---

## చతుర్థ రంగకము.



స్థలము :—క్లబ్బుకేగు దారి.

సమయము :—పగలు ౪ గంటలు.

భువన మోహనరావు ప్రేమ కుమారి గృహమున కేగి; ఆమె లేదని తెలిసికొని, ఆమె రహస్య వస్తువులఁ గనుఁగొని ఆమెపై గోపమునఁ దానొనరించిన దానికి విచార పడుచు జడ్జితో మాటాడ నెంచి క్లబ్బుకు బోవుచుండును.

భువ—ఉ. ఏరిని నమ్మఁగా వలయు
నింతియుఁ గానకు నేగనేలఁ దా
గారణ మింత లేక, మఱి
గానవిశారదుఁ డన్ననో మహో
దారుఁడు నీతికో విదుఁడు
దారుణ కృత్యముఁ జేయునే యిటుల్
నేర మొనర్చి నాఁడ నయొ !
నే నిజ మారయ కుండ దైవమా.— ౨౮

ఔరా! యేమియుఁ దోఁచుట లేదు కదా (అని యోజించి)

క. వినవలయు నేరు జెప్పిన
విని యాత్రము తోడ దాను ♦ వివర మరయకే
పనుల నొనర్చెడి వాఁడిల
మనుజుఁడె? మనుజుండు కాఁడు ♦ ప్రమాననఁ బరగున్ ౨౯

ఔరా! ప్రేమ కుమారి విశారదునికి మరణ దండన విధించిన సంగతి విని అడవికిఁ బరుగెత్తినదని పరిచారికలనిరి. మోహన రావునకు బిచ్చిపట్టి కోర్టుకడకే తెంచి పిచ్చిమాటల మాటా

డుచు—ప్రేమ కుమారి—లేఖ—చేవ్రాల కాగితము—నేను వాదించెదను—విశారదుఁడు నేర మొనరింప లేఁడు—ప్రేమ కుమారి—జమీందారే. అయ్యో-విశారదా-ఆరహస్యములను బయలుఁబెట్టవద్దనియు—నాకై కోర్టులో వాదింప వద్దనియు-మాట గైకొంటివే—లేకున్న-నిన్ను గాపాడియుందునే—అని యేమేమొ మాటాడెను. అయ్యో! విశారదుఁడు ఇతరుల కొఱకై తన ప్రాణములఁ గోల్పోవ సిద్ధపడియెనే. (పైకిఁ జూచి) బహుశా ప్రేమ కుమారిదే తప్పైయుండునా?—(యోజించి) నాకేమొ యను మానముగ నున్నది. ప్రేమ కుమారి విశారదుని ప్రేమింప కున్న అడవికిఁ బరుగిడనేల? అకటా! ఎంతఁజేసితిని. సత్యాసత్యములను విచారించక, కడకు ప్రేమ కుమారికిఁ గూడఁదెలియకుండ, విశారదుఁడు నాకు ద్రోహమొనరించెనని నాలో నే ననుకొని యభియోగముఁ దెచ్చి మరణశిక్షఁ జెప్పించితినే. ప్రేమకుమారి విశారదుఁడు తన కపరాధముఁ జేసెనని చెప్పనే లేదుకదా? నా యనుమానము నన్నెంత జేసెను. అకటా! విశారదుఁ డిప్పటికి స్వర్గము నలంకరించి యుండునేమో. ఔరా! వనితా వ్యామోహమునకుఁ జిక్కిఁ వానినిఁ జంపించితినే. వృద్ధత్వమునఁ బెండ్లి యాడినదానిఫల మకటా! ఎటులఁ బరిణమించెను.

సీ. ముదుసలి తనమున ♦ బుద్ధి లేకయ పెండ్లిఁ
జేసి కొనుచు నుండు ♦ చెనటు లార!
ధనరాశి కాసించి ♦ తమ చిన్ని బిడ్డల
ముసలి వారికిఁ గట్టు ♦ మూర్ఖు లార!
తంత్రములను బన్ని ♦ తగని దాంపత్యము
లాచరించుచు నుండు ♦ నధము లార!
న్యాయ మన్యాయంబు ♦ లరయక నావలె
దుష్కృత్యములఁ జేయు ♦ దుష్టు లార!

తే. గీ. కాంచితిరి నాదు చరితంబుఁ ♦ గన్నులార!
భువిని నావంటి నీచులుఁ ♦ బుట్టఁ గలరె!
యిటులఁ గాఁబోకుఁ డయ్యయో ♦ యెన్నటికిని
నేమిఁ జేయుదు నే నింక ♦ నెటుల సైతు. ౫౦

ఇపుడు ప్రేమకుమారి యడవికిఁ బరుగిడుటఁ జూడ విశారదుఁడు నిర్దోషియని తేలుచున్నది. ఛీ! విశారదుఁడుఁ బోయిన పిదప నేవరుండి యేమి ప్రయోజనము. ఇన్నిటికిఁ గారణభూతురాలగు ప్రేమకుమారిని మన నియ్యరాదు. దానిని జూచినదే కాల్చివేసి అన్యాయముగ విశారదుని జంపించినందులకు నేఁగూడఁ గాల్చికొని వానిఁ జేరఁ బోయెదఁగాక. (నిట్టూర్పువిడిచి) నాకేదియుఁ దోఁచుటలేదు. ఇపుడు క్లబ్బునకేగి రాత్రి ప్రేమకుమారి గృహమునకు వచ్చినదే దానినిఁ బరిమార్చెదఁ గాక. (అని పోవును)

---

## పంచమ రంగము.

స్థలము :—విశ్రాంతి భవనము (Club)
సమయము :—సాయంకాలము 6 గంటలు.

రమేశదత్తు, నరేంద్రుఁడు మఱి యొకరితోఁ గలిసి మాట్లాడు చుందురు.

రమే—నరేంద్రా! జమీందారుగా రేలనో రాకుండిరే.

నరే—ఆలస్యమునకుఁ గారణము విశారదుని శిక్షయే యై యుండును.

రమే—పాపము. మోహనరావు గారికి పిచ్చి పట్టినది కదా? విశారదుఁడన్న ప్రాణము లర్పించుచుండెను. పాపము పిచ్చి కుదురునో లేదో.

నూతనవ్యక్తి—(పత్రికఁ జదువు చుండును.)

నరే—నాకుఁ జూడ పిచ్చి కుదరదని తోఁచెడిని.

రమే—(ప్రక్కకుఁ జూచి) అదిగో! జమీందారుగారే తెంచిరి.

ప్రవేశము :—భువనమోహనరావు.

భువ—ఆలస్యమునకు క్షమింపవలెను. (అని కూర్చుండును. నలుగురును జేరి కొంత సేపు చీట్లాడు చుందురు. పేకాట సాగించుచు)

రమే—నరేంద్రా! నీవు తప్పాడితివి.

నరే—నేనా! ఏమి తప్పాడితిని.

భువ—కానిండు. ఏమి మునిగి పోయినదని వాదులాడెదరు.

రమే—చీట్లాటలోఁ గలహములు లేకున్న రుచిలేదు లెండు.—

బాలోజి :—ప్రవేశము.

బాలో—బాబూ! విశారదుల వారి తల్లి బావిలోఁబడి మరణించినది. దేవిగారు మిమ్ములఁ బిలువ మనిరి.—

భువ—ఆ-ఆ-(అని లేచిఁ పోఁ బ్రయత్నింప)

ప్రవేశము-ప్రేమ కుమారి.

ప్రేమ—(వికృతా కారమున పిస్తోలు గైకొని) ఛీ,ఛీ! భువన మోహనా! ఇల్లు వదలి యిచటనున్న నిన్ను వదలుదు ననుకొంటివా? నిలు-ఎక్కడి కేగెదవు. అందఱు (నిర్విరపడి నిలుతురు)

భువ—(పిస్తోలునెత్తి) దుర్మతీ! చచ్చితివి. (అని ప్రేల్చును)

ప్రవేశము :—మోహనరావు.

మోహ—ఆ-ఆ-ఘోరము (అని అడ్డురాగా జమీందారు ప్రేల్చిన గుండు తగిలి హా! యని క్రిందఁబడును.)

ప్రేమ—నీచా? చావుము (అని జమీందారుపైఁ బ్రేల్చును)

భువ—హా! (అని క్రిందఁబడును.)

ప్రేమ—(మరల వేఱొక తోటా నెక్కించి) విశారదా! ఇదే వచ్చితి-వచ్చితిని. (అని కాల్చుకొని క్రిందఁబడును)

యవనిక వ్రాలును.

# భరత వాక్యము.

---

సీ. సుదతులు స్వాతంత్ర్య ♦ సుఖములఁ బడయఁగఁ
జేయు వారలఁ గాంచి ♦ చెలఁగు చుండి
వెలఁదులు విద్యల ♦ వెస నేర్చు నట్టులఁ
జేయు వారలఁ గాంచి ♦ చెలఁగు చుండి
బాల్య వివాహముల్ ♦ భంగమౌ రీతిగఁ
జేయు వారలఁ గాంచి ♦ చెలఁగు చుండి
వృద్ధ వివాహ స ♦ మృద్ధినిఁ బొలియింపఁ
జేయు వారలఁ గాంచి ♦ చెలఁగు చుండి

తే. గీ. భరత పుత్రులు స్వాతంత్ర్య ♦ ప్రతిభ తోడ
ముదుక గుడ్డల మఱియును ♦ ముసుక యన్న
మైనఁ దృప్తిగ భుజియించి ♦ యలరు చుండ
భరత ఖండంబు సంతోష ♦ పడును గాత.

ఇది పంచమాంకము.

సంపూర్ణము.

---

కేసరి ముద్రాక్షరశాల, చెన్నపురి.

# సువర్ణ కేసరీ కృష్ణసేన

ఇది యొక కల్పిత నవల. డెమ్మీసైజున సుమారు 200 పుటలు గలిగి సులభశైలిని వ్రాయబడిన చక్కని నవల. కథా కల్పనము అతి విచిత్రముగ నున్నది. చదువ మొదలిడిన అంత్యమగు వఱకు చదువ బుద్ధిపొడమును. సువర్ణ కేసరీ కృష్ణసేనుల కష్టములను చదివిన జాలికలుగును. చంపకమాలా చంద్రమల్లుల సాహసకృత్యములను చదివి తీరవలసి యున్నది. వెల ఒక రూపాయమాత్రమే.

గ్రంథకర్త,

కలవటాల జయరామారావు.



# కలియుగదర్పణము

కలిపాతక నిరసనము! ఖలవిదారక చండశాసనము!

వృద్ధ వివాహములను, అతిబాల్య వివాహములను ఖండించుటకై వ్రాసిన చక్కని నాటకము. సంఘదురాచారములు నిర్భయముగ ఖండింపబడినవి. చక్కని పద్యరత్నములతో గ్రంథమంతయు నిండింపబడినది. పద్యములను చదివినచో కడుపుబ్బనవ్వు పుట్టించును. ఆంధ్ర భాషయందిట్టి గ్రంథము లెన్నియోలేవు. కొద్దిప్రతులేగలవు.

గ్రంథకర్త,

కలవటాల జయరామారావు.

వలయువారు :—

గృహసరస్వతీ బుక్ డిపో, కడప.

అని వ్రాయవలయును.

పాండురంగని భజనలు చేయుచున్న గోష్ఠి భక్త [illegible]

# శ్రీ పాండురంగ సంకీర్తనలు.

గ్రంథకర్త:

ఆంధ్రదేశమందు ప్రథమమున పాండురంగభజనలు నెలకొల్పి ప్రఖ్యాతి వహించిన శ్రీ కేశవదాసుగారి ప్రియశిష్యుండగు

పండరీభక్త: **ఎం. నారాయణదాసు.**

భక్తాగ్రేసరులారా! కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురం, చిత్తూరు, నెల్లూరు, గుంటూరు, కృష్ణ, గోదావరి, విశాఖపట్టణము, రంగూను మొదలగు జిల్లాలలో శ్రీ పాండురంగ భజనలు జరుగుచుండుట అందరికిని తెలిసిన విషయమే. అటువంటి భజనలలో పాడుకొని తరించుటకుగాను, పండరీభక్త: ఎం. నారాయణదాసుగారిచే రచింపబడిన శ్రీ పాండురంగ సంకీర్తనలను ప్రకటించియున్నాము. ఈ కూర్పునందు మునుపటికన్న 16 పేజీలు ఎక్కువచేసి దాసుగారి తత్వములు చేర్చియున్నాము. మరియు, శ్రీ పాండురంగభజనలు చేయువారికేగాక తద్భక్తులందరికిన్ని తన్మహిమమును తెలుసుకొనగలందులకు, శ్రీ పాండురంగ క్షేత్ర మహాత్మ్యమును తెలిసికొనుట ముఖ్యావశ్యకమని అందరికి బోధపడులాగున వచనకావ్యమున వ్రాయించి ఇందుచేర్చియున్నాము. దాసుగారి ఫోటోలు, చంద్రభాగానది పండరిపురము, శ్రీ పాండురంగస్వామి మొదలగు పటములుకలవు. భగవత్కటాక్షములేక ఇహపరలోకములందు శ్రేయస్సులేదు. భక్తిలేక భగవత్కటాక్షము కలుగజాలదు. భక్తిగలుగు మార్గములలో పాండురంగ సంకీర్తనలకుమించిన సదుపాయములేదు. సకల పురుషార్థ సాధకంబగు శ్రీ విఠలునిభక్తి నార్జించి తన్మూలమున భవంబునుదొరంగి నిత్యమగు మోక్షమును బొందుట కావంతయు సందియములేదు. కాన ప్రతివారును ఒక గ్రంథమునుకొని ఇందుగల మహాత్మ్యమునుచదివి, కీర్తనల నృత్య తరంగ వాద్యములతో గానముచేసి తరించుదురుగాక యని కోరుచున్నాము.

**జక్కా సుబ్బరాయులు,**

శ్రీ గృహసరస్వతీ బుక్ డిపో, కడప.

